"రెండిటిలో ఏది కావాలి—
రుచి ప్రధానంగా మిశ్రమంచేసిన
పరిశుద్ధమైన ఇండియన్ కాఫీయా,
ప్రత్యేక తరహాల
ననుసరించి తయారుచేసిన
ఫ్రెంచి కాఫీయా?"




G. ST. 12

THE UNITED COFFEE SUPPLY COMPANY LIMITED, COIMBATORE.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక కార్టూనులు, ఫోటోశీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

మార్చి 23 వ తేదీ విడుదల

సాహసోపేత ప్రేమ గాధ

బసంత్-వాడియా బ్రదర్స్ వారి





# అరబ్బీ వీరుడు జబక్

పూర్తి పంచరంగుల చిత్రం (తెలుగు)

| మాటలు పాటలు | నిర్మాత-దర్శకుడు | సంగీతం |
|---|---|---|
| శ్రీ శ్రీ | హోమీవాడియా | విజయభాస్కర్ |

పూర్ణా రిలీజ్....... నైజాం-చిత్రా రిలీజ్




## ఎక్కడ లైఫ్‌బాయ్ ఉన్నదో
## అక్కడ ఆరోగ్యము వున్నది!

ఆహా, లైఫ్‌బాయ్‌తో స్నానం, ఆనందదాయకం! దాని హాయిగొలిపే అనుభవాన్ని... పులకింపజేసే ఆరోగ్యకర స్పర్శను మీరు ఇష్టపడతారు! ఆటలోనైనా, పనిలోనైనా మురికి అంటకుండా ఎవరూ తప్పించుకోలేరు. లైఫ్‌బాయ్‌యొక్క సమృద్ధయిన నురగ మురికిలోని క్రిములను కడిగివేసి మీ ఆరోగ్యాన్ని కాపాడుతుంది. మీ కుటుంబములో అందరూ నేటినుంచి లైఫ్‌బాయ్‌ని వాడుట మంచిది కాదా?

L. 16-X29 TL

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

# పాఠకుల లేఖలు

## ఏప్రిల్ 1961

"చందమామ"లో నాకు నచ్చనిది ఏమీ లేదు.

—డా. జి. రామచంద్రరాజు, లక్కవరం

"జ్వాలాద్వీపం" చదివినంతసేపు యుద్ధరంగములో నున్నానా అనిపిస్తోంది. "పారనియుక్తి," "ముగ్గురు ప్రవీణులు" బెస్టుగా నున్నవి.

—అర్. లక్ష్మీనారాయణ, డోర్నకల్

"గుడ్డి దర్బారు," "పారని యుక్తి" చాలా బాగున్నాయి. "తోడేలు ఉపవాసము," "ఘంటాకర్ణుడు" చదువుచున్నంతసేపు నవ్వాగిందికాదు. అట్టమీది బొమ్మ ఎంత చూసినా తనివితీరుటలేదు.

—అల్లాడ దినేష్‌కుమారి, కవితి

"పారనియుక్తి", "తోడేలు ఉపవాసము," "గుడ్డి దర్బారు," "మహాకవి భారవి" ఉత్తమ రచనలు.

—చిప్పల్‌తుర్తి రాములు, జోగిపేట

"తోడేలు ఉపవాసం," "ముగ్గురు ప్రవీణులు," "సీతా వనవాసం," తదితర కథలన్నియూ చాలా బాగున్నవి. సీరియల్ కథలు చాలా బాగున్నవి.

—కుమారి తరిమన ఉష, నుంగంబాకం

"జ్వాలాద్వీపం," "పారనియుక్తి," "ముగ్గురు ప్రవీణులు," "సువర్ణ హస్తం," "కొయ్య గుర్రం" బాగ వ్రాసినందులకు రచయితలకు అభివందనములు.

—బాలకృష్ణ రావూర్
(దంపతులు), ఆలంపూర్

"కొయ్యగుర్రం" పొడిగించిన భాగవుండుననని నా అభిప్రాయము.

—సి. ఎస్. రాఘవాచార్యులు, పరుచూరు

"కొయ్యగుర్రం" ముగింపువలన చాలా విచారంగా యున్నది.

డి. రాంరెడ్డి, కొడంగల్

"కొయ్యగుర్రం" ముగింపు అవుతుందని చాల విచారిస్తున్నాము.

—చీదెళ్ళ నరిసింహమూర్తి, సింగరాయకొండ

"జ్వాలాద్వీపం" ఎన్నిసార్లు చదివినాగాని నూతన ఉత్సాహం ఉద్భవిస్తున్నది. "చిత్రా" చిత్రాలు పాఠకులకు మైమరపించే ఆనందం ఇస్తాయి.

—పి. చెన్నకేశవులు, ఖిల్లాఘనపురము

"శమంతకమణి," "జ్వాలాద్వీపం," "సీతా వనవాసం" ఎంతో బాగున్నవి. కార్టూన్లు ఏమీ బాగులేవు.

—వి. అహల్యాబాయి, బళ్లారి

"ఉపన్సు," "తోడేలు ఉపవానం" చాలా బాగున్నవి.

—గోరంట్ల మాధవక్రిష్ణయ్య, ఉరవకొండ

"ఉపన్సు," "సువర్ణహస్తం," "గుడ్డి దర్బారు" రచయితలు బాగుగా రచించారండీ.

—టి. సోమేశ్వర్, సుబ్లేడ్

"ఉపన్సు," "పారనియుక్తి" చాలా బాగున్నవి. అట్టమీది బొమ్మ వ్రాసిన వడ్డాది పాపయ్యగార్కి నా అభివందనములు.

—సి. వి. జగన్నాధరెడ్డి, కాశీబుగ్గ

పుస్తకము ("చందమామ") విప్పకుండానే ముఖ చిత్రము నన్నెంతో ఆకర్షించుచున్నది.

—విశ్వనాథం వీర్రాజు, స్లల్లూరు

# ఇప్పుడు
## మీకు ప్రియమైన ఆరోగ్యముచేకూర్చే విటమినులు కలిసిన వాటర్‌బరీస్ కాంపౌండ్ తీసుకోండి

భారత దేశమందు మిక్కిలి ప్రియముగు, అమూల్యమైన విటమినులతో కూడిన టానిక్కును మీరు యిప్పుడు కొనగలరు. ప్రఖ్యాతి గాంచిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఫార్ములాలో ఆరోగ్యమును, పుష్టిని కలిగించెడు అనేక విటమినుల చేర్పు జరిగినది. వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండ్ మీకు అనేక విధములుగా మేలు కలుగజేయును. ఇది రక్తమును వృద్ధిచేసి, కోల్పోయిన శక్తిని మరల చేకూర్చి, మీకు ఉత్సాహము నిచ్చును. ఇది నరములకు సత్తువ కలుగజేసి కండరముల అభివృద్ధికి తోడ్పడుటయేగాక వ్యాధులను కూడా నిరోధించును. జబ్బు చేసిన తరువాత త్వరగా స్వస్థత పొందుటకు యిది చాలా సహాయపడును.




## వాటర్‌బరీస్
విటమిన్
## కాంపౌండ్

మీ ఆహార పోషణను పూర్తిచేయును.

దగ్గు, జలుబులకు క్రియోసోట్ మరియు గ్వైకాల్‌తో కూడిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఎఱ్ఱ లేబిల్ గల సీసాలో కూడా లభించుచున్నది.



# కాల్గేట్‌తో నోటినించి దుర్వాసన రాకుండా చేసుకోండి రోజంతా దంతక్షయం రాకుండాకూడా కాపాడుకోండి!

ఎందుకంటె : ఒక్క సారి తోముకొంటేనే కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసన మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85% వరకు తొలగించును

కాల్గేట్ 10 మందిలో 7 గురికి నోటి దుర్గంధమును వెంటనే ఆపుతుందని మరియు భోజనము అవగానే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొనుట ద్వారా ఎక్కువ మందికి ఎక్కువ దంతక్షయము అరికట్టిందని దంత శాస్త్ర చరిత్రలో పూర్వము ఎన్నడూ తెలియచేయనంతలా శాస్త్ర పరిశోధన ఫలితగాము నిరూపించబడినది!

ఊరికే నోటిలో నీళ్లు పోసుకొని పుక్కిలించుట చాలదు. భోజనము అయిన వెంటనే క్రమం తప్పకుండా కాల్గేట్‌తో పళ్లు తోముకోండి. దాని ప్రత్యేకమైన నురుగు పళ్ల మధ్య కనపడకుండా ఉండే సందులలోనికి వెళ్లి నోటి దుర్వాసనకు మరియు దంతక్షయమునకు కారణమైన కుళ్లిపోతున్న ఆహారపు తునకలను తీసివేస్తుంది!

పిల్లలు కాల్గేట్‌తో పళ్లు తోముకొనుటకు ఇష్టపడతారు. ఎందుకంటె చాలా సేపు ఉండే దాని పిప్పర్‌మెంట్ వంటి రుచి అంటే వారికి ప్రీతి!




కాల్గేట్‌తో క్రమం తప్పకుండా పళ్లు తోముకొంటే

- ✓ నోటి దుర్వాసనను పోగొట్టును
- ✓ దంతక్షయమును నిరోధించును
- ✓ పళ్లను మెరుస్తూ ఉండేలా ఉంచును




మీకు పౌడరు కావాలంటే, ఈ లాభములన్నిటిని మీరు కాల్గేట్ టూత్ పౌడరు ద్వారా పొందగలరు... ఒక డబ్బా నెలలు వస్తుంది




నోరు ఎక్కువ శుభ్రముగా, తాజాగా ఉండుటకు మరియు పళ్లు ఎక్కువ తెల్లగా ఉండుటకు ప్రపంచములో ఏ ఇతర పళ్లు తోముకొనే క్రీమ్ కన్నా కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

లోగడ భాసనాటక కథ "చారుదత్తుడు" ముద్రించినప్పుడు కొందరు పాఠకులు ఆ కథ పూర్తిగా లేదనీ, పూర్తి కథను తామెక్కడో చదివామనీ రాశారు. అది శూద్రకుడు రచించిన "మృచ్ఛకటికం" అనే నాటకం కథ. ఆ కథను "మట్టిబండి" అనే పేరుతో ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

"కొయ్యగుర్రం" కథ ఈ సంచికతో ముగుస్తున్నది. పై సంచిక నుండి "రామాయణం" రెండవ రంగుబొమ్మల సీరియల్‌గా ప్రచురించబోతున్నాము.

"జ్వాలాద్వీపం" జూను సంచికతో ముగుస్తుంది. జూలై సంచిక నుంచీ మరొక సీరియల్, అద్భుతరసంతో కూడినది ప్రారంభమవుతుంది; వేచి ఉండండి.

సంపుటి 28 : ఏప్రిల్ 1961 : సంచిక 4

15




# భార్యకుతగిన భర్త

ఒక ఊళ్ళో సూరయ్యా, మంగమ్మా అని కాపు దంపతు లుండేవాళ్ళు. సూరయ్య రోజూ పొద్దున్నే పొలానికి వెళ్ళి సాయంత్రానికి ఇంటికి వచ్చేవాడు. మంగమ్మ ఇంటి దగ్గిరే ఉండి ఇంటినీ, తన పెంపుడు కోళ్ళనూ చూసుకునేది. ఆమెకు కోళ్ళు పెంచడమంటే చాలా యిష్టం. అందువల్ల ఆ ఊరివాళ్ళంతా తమ కోడిపిల్లల్ని పెంపకానికి మంగమ్మ దగ్గిరికి తెచ్చి, అవి పెద్దవైన తర్వాత ఓ రెంటిని ఆమెకిచ్చి మిగతావి పట్టుకెళ్ళేవాళ్ళు. అలా మంగమ్మ దగ్గిర పాతిక, ముప్పై కోళ్ళు పోగయాయి.

సూరయ్యకు కోడి మాంసమంటే బలే ఇష్టం. ఓ కోడిని కోసి వండమని అతను ఎన్నోసార్లు భార్యనడిగాడు. కాని ఆవిడ ససేమీ ఒప్పుకోలేదు.

ఆలోచించి ఆలోచించి సూరయ్య ఒక పన్నాగం పన్నాడు. అతను ఓనాడు భార్యతో, "ఏమేవ్, మంగూ! నిన్న ఓ స్వాములవారు కనిపించాడు. మన పొలం ఈ మధ్య సరిగా పడటంలేదు కదూ? అందుకు కారణమేమిటని అడిగాను. అందుకాయన ఏం చెప్పాడంటే—మన ఊరి చివర రావి చెట్టున్నది చూశావా? ఆ చెట్టు తొర్రలో పంటల దేవుడున్నాట్ట. అందుకని రోజూ ఆ తొర్రలో కోడిమాంసం కూర ఉంచి వెనక్కు తిరిగి చూడకుండా వెళ్లిపోవాలన్నాడు. అలా ఒకనెల రోజులపాటు చేస్తే పంటలదేవుడు అనుగ్రహించి మన పొలం బాగా పండుతుందిట," అని చెప్పాడు.

ఈ మాటలు విని మొదట మంగమ్మ గాభరా పడిపోయింది; తరవాత, ఎంతోసేపు ఆలోచించి, పొలం బాగా పండుతుంది గదా అని తన మనస్సును సమాధాన పరుచుకుని, తన భర్త చెప్పినట్టు చెయ్యటానికి ఒప్పుకుంది.

ఎం. ఎల్. పతి

ఆ నాటినుంచి మంగమ్మ రోజూ ఒక కోడిని కోసి, మసాలావేసి కూరచేసి, అన్నంతో పాటు కట్టి తీసుకుపోయి, ఊరి చివర ఉన్న రావిచెట్టు తొర్రలో పెట్టి, వెనక్కు తిరిగి చూడకుండా ఇంటికి చక్కా వచ్చేది. మంగమ్మ వెళ్లిపోగానే సూరయ్య చెట్టుమీది నుంచి దిగి, తొర్రలోనుంచి మూట తీసి, సంతోషంగా కోడిమాంసం భోజనం ఆరగించేవాడు.

ఒక నెల గడిచింది. మంగమ్మ ఆఖరు కోడిని కూడా కోసేసింది. కాని భర్త చెప్పిన పంటల దేవుడి అనుగ్రహం ఏమీ కనిపించలేదు.

ఈ దేవుడిలో ఏదో మోసమున్నదని ఆమెకు అనుమానం తగిలింది.

అందుచేత మంగమ్మ ఆ రోజు భోజనం చెట్టుతొర్రలో ఉంచి మామూలు ప్రకారం వెనక్కు తిరిగి చూడకుండా వచ్చెయ్యటానికి మారుగా, కొంతదూరం వచ్చి ఒక చెట్టు వెనక దాగి, ఏం జరుగుతుందోనని చూడసాగింది.

ఇంకేముందీ? సూరయ్య రావిచెట్టు దిగి వచ్చి తొర్రలోనుంచి భోజనం తీసుకుని తినటం మంగమ్మ కంటపడింది. ఆమె అగ్గి మీద గుగ్గిలమైపోయి గబగబా వెళ్లి మొగుడి వీపుమీద చేతులు నొప్పి పుట్టేదాకా కొట్టి



తరవాత నోటికి వచ్చినట్టు తిట్టి, "ఇక ఈ మొగుడితో సంసారం నావల్లకాదు," అంటూ ఇంటికి వచ్చేసింది.

ఆమె తన పుట్టింటికి వెళ్లిపోవటానికి నిశ్చయించుకున్నది. మూటా ముల్లే ఒక పెద్ద గంపలో సర్దుకుని, ఇరుగు పొరుగు అమ్మలక్కలకు వీడ్కోలు చెప్పటానికి వెళ్లింది. తన భార్య వెనకగా సూరయ్యకూడా ఇంటికి వచ్చాడు. తన భార్య ఎత్తుగడ అర్థం చేసుకున్నాడు. భార్య ప్రయాణానికి సిద్ధం చేసుకున్న గంపలో దూరి కూర్చున్నాడు.

మంగమ్మను అమ్మలక్కలు సాగనంపవచ్చారు. ఆమె తన ఇంటిని ఆఖరుసారి చూసుకుని బావురుమని ఒక శోకం పెట్టి, తన గంపను ఎత్తించుకుని పుట్టింటికి వెళ్లిపోయింది.

పుట్టిల్లు చేరుతూనే మంగమ్మ వలవలా ఏడ్చి తల్లితో తన భర్త చేసిన మోసమంతా చెప్పింది.

తల్లి మంగమ్మను ఓదార్చుతూ, "ఊరుకో, తల్లీ! అయిందేదో అయింది. ఇక నువు ఆ మనిషి మొహం చూడనేవద్దు. ఇక్కడే ఉండిపో!" అన్నది.

ఆమె తన కూతురు గంపలో ఏం తెచ్చుకున్నదీ చూద్దామని దాని మూత పైకి ఎత్తేసరికి సూరయ్య గభాల్న అందులో నుంచి బయటికి దూకి, "నేనే, అత్తా! నీ అల్లుణ్ణి!" అన్నాడు నవ్వుతూ.

ఇది చూసేసరికి అత్తకు మండిపోయింది. తనమీద పడి తినటానికని తన కూతురూ, అల్లుడూ పన్నాగం పన్ని వచ్చారనుకుని ఆమె వాళ్ళిద్దరినీ బయటికి గెంటేసి, తన గడపలో అడుగు పెట్టటానికి వీల్లేదన్నది.

మంగమ్మ గత్యంతరం లేదని తెలుసుకుని, ఆ మొగుడితోనే కాపరం చెయ్య నిశ్చయించుకుని, అతడి వెంట ఇంటికి తిరిగి వచ్చేసింది.





# శమంతకమణి

చతుర్థాశ్వాసము

ఆ చీకటి గుహలోనికి
అడుగులలో అడుగులిడుచు;
ఒదిగి ఒదిగి శ్రీ కృష్ణుడు
ఒంటరిగా పోయినాడు.

కొంత దూర మేగు సరికి
కూన నొకని లాలించుచు,
వ్రేలగట్టియున్న మణిని
వ్రేలితోడ చూపి యొకతి—

"అనగ అనగ ఒక్క రాజు.
ఆతడు వేటకు వెళ్ళెను.
దారిలోన ఒక సింహము
బారి కతడు పడి త్రెళ్ళెను.

ఆ సింహము జూలు పట్టి
అటు నిటు కుదిలించి కూల్చి,
ఎలుగురాజు నీకీ మణి
ఇష్టమెసగ తెచ్చినాడు.

ఏడువకుము, సుకుమారా!
ఆడుకొనుము ఈ మణితో,"
అని యిట్టులు పాడుచుండ
విని కృష్ణుడు అటకేగెను.

కృష్ణునిగని ఆమె దడిసి
కెవ్వున వెనుకేకవేసె.
అంత జాంబవంతు డొక్క
గంతున అటకేగుదెంచె.

ఒక్కుమ్మడి కృష్ణునిపై
ఉవ్వెత్తుగ దూకినాడు.
నిలు నిలుమని శ్రీకృష్ణుడు
ఎలుగును ఎదిరించినాడు.

గోళ్ళతోడ ఎలుగుతేడు
గ్రుచ్చి గ్రుచ్చి కుదిపినాడు.
పిడికిలించి శ్రీకృష్ణుడు
పిడి గ్రుద్దులు గ్రుద్దినాడు.



ఉత్పల సత్యనారాయణాచార్య

ఎలుగుఱేడు, శ్రీకృష్ణుడు
ఇవ్విధముగ ఇరువదియొక
దినములు వెనుదీయకుండ
దీమసమున పోరాడిరి.

వేటకాండ్రు పదిరోజులు
వేచినారు గుహవాకిట—
"బ్రతికియున్నచో కృష్ణుడు
బయలుపడడె ఇన్నాళ్ళకు?"

అని తలంచి వేటకాండ్రు
అచోటును విడిచిపోయి,
యాదవులకు ఈ అశుభము
ఖేదించుచు తెలిపినారు.

ఆ వార్తను విని రుక్మిణి,
దేవకి వసుదేవు లెంతొ
దుఃఖించుచు, తొట్రిల్లుచు,
దుర్గను కొల్వగ నేగిరి.

గౌరిదేవి వారలపై
కనికరించి సట్లప్పుడు
'గోవిందుడు కుశలం'బని
దేవళమున ధ్వనియించెను!

ద్వారకలో కృష్ణునికై
బోరున దుఃఖించినారు;
దాయాదులు తిలపిండపు
దానము లొనరించినారు.

అందుచేత కృష్ణు డచట
అమితబలుం డగుచుండెను;
ఎలుగుఱేడు నానాటికి
బలహీనుం డగుచుండెను.



కృష్ణుని పిడికిటి పోటుల
కృశియించిన ఎలుగుతేడు
మూర్ఛ మునిగి—తెప్పరిల్లి,
మ్రొక్కి యిట్లు పలికినాడు.

"ఓ మహాత్మ! దేవాదులె
ఓడింపగలేరు నిన్ను!
ననుబోలిన వారల కిక
నిను గెల్వగ శక్యమగున?

దేవా! నిజ మెఱిగింపుము
త్రేతాయుగమం దుండిన
శ్రీరాముడ వీవుకాద!
సీతాపతి వీవుకాద!

తాళ తరువుల నొకట
కూలనేసిన వాని,

వాలి నొక బాణమున
నేల గూల్చిన వాని,

జలధిపై కోపించి
చాపమెత్తిన వాని;
తలలు పది రక్కసుని
తఱిగివేసిన వాని,

శరణు చొచ్చిన వాని
సాకగల్గిన వాని,
పురుషులకె మోహంబు
పుట్టజేసెడువాని,

నన్ను ఏలినవాని,
నా స్వామియగువాని,
నిన్ను శ్రీరామునిగ
నేను భావించెదను!"



అని నుతింపగ కృష్ణుడు తన
అవతారము వినిపించెను.
భల్లుకపతి భక్తితోడ
పదముల సాగిలి మ్రొక్కెను.

శ్రీకృష్ణుడు జాలిపడుచు
చేతులతో నిమిరినంత,
ఎలుగుఱేని శ్రమదీఱెను;
ఎంతయొ సంతోషించెను.

తన కూతును జాంబవతిని
అనుపమ సౌందర్యవతిని
పిలిచి తెచ్చి శ్రీకృష్ణుని
పెండ్లియాడుమని కోరెను.

కన్యతో శమంతకమును
కట్నముగా సమర్పించి,
పంపించెను ఎలుగురాజు
పరమానందము నొందుచు.

"ఈ రత్నముకోస మేను
ఇంతదూర మేతెంచితి;
ఇంతకంటె మంచి రత్న
మిచ్చట సంపాదించితి!"

అని పలుకుచు జాంబవతిని
అలరించుచు శ్రీకృష్ణుడు
వచ్చుచుండ—దేవళమున
వసుదేవాదులు చూచిరి.

మృతినొందినవాడు మరల
బ్రతికి వచ్చినట్లు తోప,
మహదానందము నొందిరి,
మంగళహారతు లిచ్చిరి.

ఆ రుక్మిణి కన్నీరులు
ఆనందాశ్రువు లాయెను!
జాంబవతిని కౌగిలించి
సాదరముగ గొనిపోయెను..-(సశేషం)






## 16

[ఉగ్రదత్తుణ్ణీ, అతడి స్నేహితులైన రుద్రాచార్యుడుల్నీ తీసుకుని పులిరాయుళ్ళు, జ్వాలా ద్వీపానికి బయలుదేరారు. వాళ్ళను ఆకాశంలో భల్లూకరాయుళ్ళు ఎదుర్కొన్నారు. ఉగ్రదత్తుడున్న భయంకరపక్షి ఒక కొండ మీద దిగింది. అక్కడ కొందరు భల్లూకరాయుళ్ళు అతణ్ణి వెంటబెట్టుకుని, ఒక రహస్య బిలం గుండా బయలుదేరారు. తరవాత—]

భల్లూకరాయుళ్ళు బిల ద్వారాన్ని మూయగానే, లోపల అంతా గాఢాంధకారమయింది. ఉగ్రదత్తుడు అడుగు వేయబోయి కాలు జారటంతో ముందుకు పడబోయాడు. కాని, అంతలోనే ఒక భల్లూకరాయుడు అతడి భుజం పట్టుకుని ఆపుతూ, "తొందరపడకు. మనం యిరవై మెట్లు దిగిగాని, బిలం అడుగుభాగాన్ని చేరలేం. ఇదుగో, మనకు దారి చూపే వెలుగు!" అంటూ కట్టుకున్న ఎలుగు చర్మాల్లో నుంచి ధగధగ ప్రకాశిస్తున్న ఒక మణిని బయటికి తీశాడు. ఆ వెంటనే, అతడి అనుచరులిద్దరూ కూడా తమ వద్ద వున్న మణులను బయటికి తీసి, మెట్లు దిగసాగారు.

భల్లూకరాయుళ్ల చేతుల్లో మెరిసిపోతున్న మణులను చూస్తూనే ఉగ్రదత్తుడు ఎంతో ఆశ్చర్యపడ్డాడు. చీకటిలో దారి చూసుకునేందుకు కాగడాలూ, కొవ్వొత్తులూ లేనందున, ఈ వెలలేని మణులను వీళ్ళు కాగడాలుగా వాడుకుంటున్నారన్నమాట.



"ఈ ద్వీపంలో చమురు దొరకదా? వెలుగు కావాలంటే, ఈ మణులు తప్ప మరో సాధనం లేదా?" అని అడిగాడు ఉగ్రదత్తుడు.

"చమురా? ఏమిటదీ? ఓహో, దాన్ని గురించి యిక్కడకు బానిసలుగా వచ్చిన మీ దేశంవాళ్ళు చెప్పగా విన్నాం," అన్నాడొక భల్లూకరాయుడు.

"ఇది చాలా చిత్రమైన ద్వీపం," అనుకున్నాడు ఉగ్రదత్తుడు. అంతలోనే అతడికి పులిరాయుళ్ళ చేజిక్కిన తన స్నేహితులు రుద్రారుద్రులూ, సామంతరాజు సుదర్శనుడి కుమార్తె చంద్రసేనా గుర్తుకువచ్చారు.



ఉగ్రదత్తుడు వాళ్ళను గురించి ఆలోచిస్తూనే, ఇరవై మెట్లు దిగి, బిలం అడుగుభాగాన్ని చేరాడు. బిలం ఏమంత విశాలమైనదికాదు. దాని వెడల్పు ఒక గజం కన్న ఎక్కువ వుండదు. ఎత్తు కొన్నిచోట్ల అయిదడుగులూ, మరికొన్ని చోట్ల పదడుగులవరకూ వుంటుంది.

"ఈ బిలం ఎక్కడికి పోతుంది? ఇంతకూ మీరు నన్ను పులిరాయుళ్ళనుంచి కాపాడింది, మరొక భల్లూకరాయుడికి బానిసగా అమ్మేందుక్కాదు గదా?" అన్నాడు ఉగ్రదత్తుడు.

భల్లూకరాయుళ్ళలో ఒకడు నవ్వాడు, మరొకడు కోపంగా గద్దించాడు, మూడవవాడు, ఉగ్రదత్తుడికేసి చూస్తూ, "నిన్ను బానిసగా చేసేందుకే తీసుకుపోతున్నవాళ్ళమయితే, నీకీ బిల మార్గం తెలియకుండా కళ్ళకు గంతలు కట్టి వుండేవాళ్ళం. మేము మల్ని బానిసలుగా వుపయోగించుకునే వాళ్ళం మేంకాదు, పులిరాయుళ్ళు. అయినా మీ దేశంవాళ్ళనందర్నీ నమ్మేందుకు లేదు. మీవాళ్ళే కొందరు బానిసల్ని పట్టుకొచ్చేందుకు, పులిరాయుళ్ళ నాయకుడైన ఏకపాదుడికి సహాయం చేస్తున్నారు. నాగవర్మ అనేవాడు తెలుసా?" అన్నాడు.



"తెలుసు. వాడు...." ఉగ్రదత్తుడు మాట ముగించేలోపలే, మరొక భల్లూకరాయుడు మొదటివాణ్ణి గట్టిగా కసురుతూ, "నువ్వు చాలా అధికప్రసంగి వవుతున్నావు. మన నాయకుడు చెప్పి పంపిన దేమిటి?" అన్నాడు తీవ్రంగా.

మొదట మాట్లాడిన భల్లూకరాయుడు కుక్కిన పేనులా అయిపోయాడు. మణులను అరచేతిలో పెట్టుకుని ముందు ఇద్దరు భల్లూకరాయుళ్ళూ, మధ్య ఉగ్రదత్తుడూ, అతడికి వెనకగా మరొక భల్లూకరాయుడూ మౌనంగా బిలం వెంట నడవసాగారు. రెండు మూడు నిమిషాల కాలం అలా నడిచేసరికి, ఎదురుగా బిలం మూసుకుపోయినట్టు, అడ్డంగా నిలువెత్తు రాయి ఒకటి కనిపించింది. ముందు నడుస్తున్న భల్లూకరాయుడు, అక్కడ ఆగి, రాతిలో కొంచెం పల్లంగా వున్న చోట చూపుడు వేలితో నొక్కాడు. రాయి కొంచెం కదిలినట్టయింది. ఆ వెంటనే దాని వెనక నుంచి, 'శరభం!' అన్న పిలుపు వినవచ్చింది. దానికి జవాబుగా ముందున్న భల్లూకరాయుడు, 'భల్లూకం!' అన్నాడు పెద్దగా. రాయి తలుపులా కిర్రుమంటూ కొద్దిగా తెరుచుకున్నది. ఎలుగుబంటి చర్మాలు ధరించి, పెద్ద కత్తి



నొకదాన్ని పట్టుకొని వున్న భటుడొకడు రాతి తలుపు పక్కనుంచి తొంగి చూశాడు.

'శరభం', 'భల్లూకం' అన్న మాటలు ఆ రాత్రికి భల్లూకరాయుళ్ళు నిర్ణయించుకున్న సంకేతాలని ఉగ్రదత్తుడు గ్రహించాడు. వీళ్ళుకూడా ఇరవైనాలుగ్గంటలూ శత్రుభయంతో సతమతమై పోతున్నారని అతడు ఊహించాడు.

"ఒక్కడేనా దొరికింది! తతిమ్మావాళ్ళేమయారు?" అన్నాడు కావలి భటుడు.

"వాళ్ళ సంగతి మా కేమీ తెలియదు. అయినా, గబ్బిలాయిలా బిలాన్ని అంటిపెట్టుకుని వుండే నీకు ఈ వైనాలన్నీ






ఎందుకు?" అంటూ ముందున్న భల్లూక రాయుడు, రాతి తలుపును సాంతం తెరిచి ముందుకు వెళ్ళాడు. అతడి వెనకగా మిగిలినవాళ్ళు కూడా బయలుదేరారు.

ఉగ్రదత్తుడు, భల్లూకరాయుళ్ల వెంట బిలంలో చాలా దూరం నడిచాడు. అయినా, దానికి అంతం వున్నట్టు కనబడలేదు. బిలంలో అనేక చోట్ల పైనుంచి వెలుగు పడుతున్నట్టూ, కొన్ని కొన్ని ప్రాంతాల్లో ఎవరో, బిలం గోడల వెనుక మాటలాడుతున్నట్టు కూడా అతడికి అనుమానం కలిగింది. ఈ భల్లూకరాయుళ్ల నాయకుడు కంధుడు పులిరాయుళ్ల ధాటికి తట్టుకోలేక, ఇలాంటి



రహస్య ప్రదేశాల్లో కాలం గడుపుతున్నాడని ఉగ్రదత్తుడు అనుకున్నాడు.

హఠాత్తుగా ముందు నడుస్తున్న భల్లూక రాయుడు ఆగి, తన అరచేతిలో వున్న మణిని గట్టిగా గుప్పెటలో బిగించి, దాన్ని నేలబారుగా నాలుగైదుసార్లు వూపాడు. ఆ వెంటనే భూమి బద్దలవుతున్నట్టు పెద్ద ధ్వని అయింది. చూస్తూండగానే భల్లూక రాయుడి పాదాల దగ్గిర భూమి విచ్చినట్టయి, అందులోనుంచి కళ్లను మిరుమిట్లు కొలిపేలా వెలుగు పైకి వచ్చింది.

"ఇక్కడ ఇరవైఒక్క మెట్లున్నవి! జాగర్త, కాలు జారిందో..." అంటూ ఒక భల్లూకరాయుడు ఉగ్రదత్తుణ్ణి హెచ్చరించి, మెట్లుదిగసాగాడు. ఉగ్రదత్తుడి ఆశ్చర్యానికి అంతులేదు.

బిలం మధ్యలో ఒక పెద్ద అగాధం, అందులో నుంచి పట్టపగలులా వెలుగు!

ఉగ్రదత్తుడూ, అతడి వెంట వున్నవాళ్లూ మెట్లుదిగి, సమతలంగా వున్న ప్రదేశాన్ని చేరారు. ఆ ప్రదేశానికి చుట్టూ వున్న గోడలలో తాపడం చేసిన మణుల నుంచి దేదీప్యమానంగా కాంతి వస్తున్నది. ఎదురుగా నిలువెత్తున ద్వారం ఒకటి వున్నది. దాని తలుపులు బంధించబడివున్నవి. ఉగ్రదత్తుడి







"ఆయనే, మా నాయకుడు కంధుడు. నిన్ను దగ్గిరకు తీసుకురావలసిందిగా చెప్పారు," అన్నాడు. ఉగ్రదత్తుడు నిర్భయంగా, కంధుడి ఎదుటకు వెళ్ళి నిలబడ్డాడు. కంధుడు అతణ్ణి నిశితంగా చూస్తూ, "నీతోబాటు మీ దేశాన్నుంచి పులిరాయుళ్ళచే అపహరించుకు రాబడిన వాళ్ళెందరు?" అన్నాడు.

"నలుగురం. ఒకామె స్త్రీ," అన్నాడు ఉగ్రదత్తుడు.

"వాళ్ళెక్కడున్నారో, నీకేమైనా తెలుసా?" అని అడిగాడు కంధుడు.

"తెలియదు," అంటూ ఉగ్రదత్తుడు ఆశ్చర్యపోయాడు. కంధుడు యిలాంటి ప్రశ్నలు తనను ఎందుకడుగుతున్నాడో, వీటి వెనక వున్న రహస్యం ఏమిటో అతడికి అవగాహన కాలేదు.

ఉగ్రదత్తుడు తనను గురించే ఆలోచిస్తున్నాడని గ్రహించినవాడిలా కంధుడు చిరునవ్వు నవ్వి, "నేను, మీకు మిత్రుణ్ణి. మీ దేశాన్నుంచి మనుషుల్ని అపహరించుకు రావటంలో నాకెలాంటి ప్రమేయం లేదు. పులిరాయుళ్ళు మీకెంత శత్రువులో, నాకూ అంతే శత్రువులు. కొండగుహల్లో, బిలాల్లో నేనూ, నా అనుచరులూ ఎంత రహస్యంగా కాలం గడపవలసి వస్తున్నదో నువ్వే

వెంట వచ్చిన భల్లూకరాయుళ్లలో ఒకడు, ఆ తలుపుల దగ్గరకు వెళ్లి, వాటిమీద గుప్పెటతో, మూడుసార్లు గట్టిగా కొట్టాడు. వెంటనే ద్వారాలు తెరుచుకున్నవి. ఎదురుగా వున్న ఒక ఉన్నతాసనం మీద శిరస్త్రాణంలో ఎలుగుబంటి చెవులు ధరించి వున్న, ఒక దృఢకాయుడు కూచునివున్నాడు.

భల్లూకరాయుడు అతడి దగ్గిరకు వెళ్ళి, మందస్వరంలో ఏదో చెప్పాడు. ఆసనం మీద కూచున్న వ్యక్తి, ఉగ్రదత్తుడికేసి దృష్టి సారించి, తల పంకిస్తూ భల్లూకరాయుడితో ఏమో అన్నాడు. వెంటనే భల్లూకరాయుడు ఉగ్రదత్తుడున్న చోటుకు వచ్చి,

చూశావుగదా? మీ దేశానికీ, ఈ జ్వాలాద్వీపానికీ మహమ్మారిలా దాపురించిన ఏకపాదుణ్ణీ, అతడి భటులనూ సర్వనాశనం చేయటానికే, నేనూ, మీ దేశస్థుడైన మరొక వ్యక్తి ఒక పథకం ఆలోచించాం. బహుశా ఆ వ్యక్తిని నువ్వు గుర్తించగలవేమో చూద్దాం," అంటూ తన అనుచరులలో ఒకడికి సౌంజ్ఞచేశాడు.

కంధుడి అనుచరుడు తమ నాయకుడి ఆసనానికి వెనకగా వున్న ఒక తలుపు తెరిచాడు. ఆ వెంటనే రుద్రుడు నవ్వుతూ ఉగ్రదత్తుణ్ణి సమీపించి, "నిన్ను ప్రాణాలతో చూడగలననుకోలేదు, ఉగ్రదత్తా!" అన్నాడు ఆప్యాయంగా.

"రుద్రుడు!" అంటూ ఉగ్రదత్తుడు పరమానంద భరితుడై, "ఆరుద్రు డెక్కడ? చంద్రసేన ఏమయింది?" అని ఆత్రుతగా ప్రశ్నించాడు.

"ఆ యిద్దరూ పులిరాయుళ్ళ అధీనంలోనే వున్నారు. నేనుమాత్రం ఈ కంధుడి అనుచరుల వల్ల రక్షించబడ్డాను," అన్నాడు రుద్రుడు నిస్పృహగా.

కంధుడు లేచి నిలబడి ఉగ్రదత్తుడితో, "నీగురించి రుద్రుడిద్వారా సర్వం తెలుసుకున్నాను. ఈనాటికి ఏకపాదుణ్ణీ, అతడి




మూకనూ నాశనం చేసే అవకాశంకలిగింది. నేనూ, నీ స్నేహితుడైన రుద్రుడూ వేసిన పథకం మరేం లేదు. నీ పెంపుడు తండ్రి అయిన ఉగ్రాక్షుణ్ణీ, అతడి సేవకులనూ ఈ ద్వీపం చేర్చి, వాళ్ళ సహాయంతో ఏకపాదుడి కోటను ముట్టడించటం," అన్నాడు.

"మీ స్వాధీనంలో వున్న భయంకర పక్షులు రాక్షసులను మోయగలవా?" అని అడిగాడు ఉగ్రదత్తుడు.

"అంత పెద్ద మహాకాయుల్ని మోసేశక్తి వాటికి లేదు. నీ బంధుగణమంతా పడవల్లో బయలుదేరి ఇక్కడికి రావలసిందే," అన్నాడు కంధుడు.

"నేను బందీగా వచ్చేప్పుడు, ఈ ద్వీపాన్ని, దీని చుట్టూ సముద్రం అంచుల వరకూ వున్న అగ్ని పర్వాతాలనూ చూశాను. అగ్ని పర్వతాల నుంచి వెలువడిన లావా ద్రవం సముద్రతీరాన్నంతా మంటలమయం చేస్తున్నట్టు నాకు కనబడింది. అలాంటి స్థితిలో పడవలు తీరాన్నెలా చేరగలవు?" అని అడిగాడు ఉగ్రదత్తుడు.

ఈ ప్రశ్న వింటూనే కంధుడు నవ్వి, తన అనుచరులకేసి సగర్వంగా చూస్తూ, "సముద్రతీరంతో మంటలపాలు కాకుండా, పడవలను ఒడ్డు చేర్చే కొన్ని ప్రదేశాలు నా అనుచరులకు తెలుసు. అసలు ప్రమాదం ఏకపాదుడి కోటను ముట్టడించటంలో వున్నది. ఆ తరవాత వాడు దొరికినా వాణ్ణి చంపటంలో మరింత పెద్ద ప్రమాదం వున్నది!" అన్నాడు.

కంధుడి మాటలు ఉగ్రదత్తుడికి సంభ్రమాశ్చర్యాలు కలిగించినై. అది గ్రహించిన కంధుడు అతణ్ణి తన వెంట పెట్టుకుని, ఒక రహస్య మార్గంగుండా బిలంలోనుంచి కొండ పై భాగానికి తీసుకుపోయి, "అదుగో, ఆ మంటల మధ్య వున్నట్టు కనబడేదే ఏకపాదుడి కోట. ఇక్కణ్ణించి చూసినప్పుడు అది మంటల మధ్య వున్నట్టు కనబడినా, నిజానికి దాని చుట్టూ అగ్నిపర్వతాలు లేవు. దాన్ని చేరేందుకు సురక్షితమైన ఒక మార్గం వున్నది. కాని, కోట మనం ఆక్రమించుకున్నా ఏకపాదుణ్ణి చంపటమే పెద్ద సమస్య!" అన్నాడు.

"మనచేతిలో వాడు చిక్కటమంటూ జరిగితే, వాణ్ణి చంపటం ఎంతసేపు!" అన్నాడు ఉగ్రదత్తుడు.

"వాడికి తిరుగులేని ఒక శక్తి వున్నది. అదేమిటంటే: వాడెవరి నెత్తుటు చూసినా, లేక వాడి నెత్తుటు ఎవరు చూసినా—తప్పక మరణిస్తారు!" అన్నాడు కంధుడు.

—(ఇంకా వుంది)






ఉజ్జయినీ నగరంలో నివసించే చారుదత్తుడనే బ్రాహ్మణ యువకుడు తాత తండ్రులు వర్తకంచేసి సంపాదించిన సొత్తంతా దాన ధర్మాల కింద ఖర్చుచేసేశాడు. అతనికి ధూతాంబ అనే భార్యా, రోహసేనుడనే కొడుకూ ఉన్నారు. చారుదత్తుడు బీదవాడై పోయినప్పటికీ మైత్రేయుడనే మిత్రుడూ, వర్ధమానుడనే సేవకుడూ, రదనిక అనే దాసీ అతనిని అంటిపెట్టుకుని ఉన్నారు.

వీరిమాట అలాఉండగా ఆ నగరంలో ఉండే సౌందర్యవతి అయిన వేశ్య వసంతసేన పయితం పేదవాడైపోయిన చారుదత్తుణ్ణే మనస్ఫూర్తిగా ప్రేమించింది.

ఒకనాటి రాత్రి వసంతసేన చీకటిలో ఇంటికి పోతూండగా రాజుగారి బావమరిది అయిన శకారుడామెను వెంబడించాడు. ఆమె అతనినుంచి తప్పించుకోవటానికి చారుదత్తుడి ఇంట ప్రవేశించింది. తరువాత ఆమె తన నగలు తీసి దాచమని చారుదత్తుడికిస్తూ, ఆ నగల కోసమే శకారుడు తనను వెంబడించాడని చెప్పింది. చారుదత్తు డామెను ఇంటి దగ్గిర దిగబెట్టి వచ్చి ఆమె నగలను పగలు తన నౌకరు వర్ధమానుడు కాపాడేటట్టూ, రాత్రి పూట మైత్రేయుడు కాపాడేటట్టూ ఏర్పాటుచేశాడు.

ఇలా ఉండగా, చారుదత్తుడికి కాళ్ళుపట్టి జీవించిన సంవాహకుడు నిరుద్యోగిగా తిరుగుతూ జూదగాళ్ళతో కలిసి జూదామాడి బాకీపడ్డాడు. వారు బాకీ ఇవ్వమని నిర్బంధించేసరికి పారిపోయి ఒక పాడుబడిన గుడిలో దాక్కున్నాడు. అతన్ని వెంటాడుతూ వచ్చిన జూదగాళ్ళు గుడిలో పాచికలు తీసి ఆట ప్రారంభించి, పందెం నాదంటే నాదని కీచులాడేసరికి, "పందెం నాది," అంటూ సంవాహకుడు బయటపడ్డాడు. వాడు అక్కడినుంచి పారిపోయి వసంతసేన ఇంట



దూరాడు. వాడు ఒకప్పుడు చారుదత్తుడి సేవకుడని తెలిసి వసంతసేన వాడి బాకీ దార్లకు సొమ్మిచ్చేసింది. ఈ సంఘటనతో మనసు మారిపోయి సంవాహకుడు బౌద్ధ సన్యాసి అయిపోయాడు.

ఉజ్జయినీ నగరంలో శర్విలకుడు అనే బ్రాహ్మడొకడుండేవాడు. వాడు వసంతసేన దాసి అయిన మదనికను ప్రేమించాడు. వాడు మదనికను పోషించగలడో లేదో తెలుసుకోవటానికిగాను వసంతసేన తనకు కొంత ధనం ఇచ్చి మదనికను తీసుకుపొమ్మన్నది. శర్విలకుడు డబ్బులేనివాడు. అయితే అతను ఇతర శాస్త్రాలతోబాటు చోరవిద్య



అభ్యసించి ఉన్న కారణంచేత ఒక చీకటి రాత్రి చారుదత్తుడి ఇంటికే కన్నం వేసి మైత్రేయుడి రక్షణలో ఉన్న వసంతసేన నగలను కాజేసి మర్నాడు వాటిని తీసుకు పోయి వసంతసేన కిచ్చాడు.

అదే సమయంలో చారుదత్తుడు, తన రక్షణలో ఉన్న నగలు పోయినందుకు విచారించి, తన భార్య రత్నావళి హారాన్ని మైత్రేయుడి ద్వారా వసంతసేనకు పంపాడు.

వసంతసేన శర్విలకుడి దొంగతనం గ్రహించికూడా పైకేమీ అనక అతని వెంట మదనికను పంపేసింది. వారిద్దరూ బండీలో వెళ్ళుతూండగా ఆర్యకుడనేవాణ్ణి రాజుగారు ఖైదు చేయించినట్టు శర్విలకుడికి తెలిసింది.

ఆర్యకుడనేవాడు ఒక గొల్ల కుర్రవాడు; శర్విలకుడి మిత్రుడు. ఈ ఆర్యకుడు ఉజ్జయినికి రాజవుతాడని ఎవరో సిద్ధుడు చెప్పాడట; ఆ కారణంగానే రాజు వాణ్ణి ఖైదు చేయించాడని జనం అనుకుంటున్నారు.

ఈ మాట వినగానే శర్విలకుడు బండి నుంచి దిగి, మదనికను తెలిసిన గాయకుడి ఇంట దిగబెట్టమని బండివాడితో చెప్పి, ఆర్యకుణ్ణి విడిపించటానికి బయలుదేరాడు.

అక్కడ వసంతసేన మైత్రేయుడిచ్చిన రత్నావళీహారం తీసుకుని తాను వస్తు





న్నట్టుగా చారుదత్తుడితో చెప్పమని మైత్రేయుణ్ణి పంపి, వెనకగా తానుకూడా వెళ్ళింది. వర్షంగా ఉండటంచేత ఆమె ఆ రాత్రికి చారుదత్తుడి ఇంటనే ఉండిపోయింది.

మర్నాడు చారుదత్తుడు పెందలాడే లేచి ఊరి వెలపల ఉండే తన ఉద్యానానికి మైత్రేయుడితో సహా బయలుదేరుతూ, తన సేవకుడైన వర్ధమానుడితో, "వసంతసేనను పెట్టె బండిలో ఎక్కించి ఉద్యానానికి తీసుకురా," అని చెప్పాడు.



వసంతసేన కొంచెం ఆలస్యంగా లేచింది. ఆమె రత్నావళీ హారాన్ని ధూతాంబకు ఇవ్వబోతే ఆమె తీసుకోక, "నాకు నా భర్తకన్న ఆభరణ మేమిటి? ఆయన ఇచ్చేసినదాన్ని నేను తీసుకోవటమా?" అన్నది.

ఆ సమయంలో చారుదత్తుడి కొడుకైన రోహసేనుడు ఆడుకోవటానికి రదనిక ఒక మట్టి బండి తెచ్చి ఇయ్యగా, వాడు దాన్ని విసిరి కొట్టి, "పక్క ఇంటి అబ్బాయి ఆడుకునేలాటి బంగారు బండి కావాలి!" అని ఏడ్చి పోరుపెట్టాడు.

వాడి ఏడుపు చూసి వసంతసేన జాలిపడి తన నగలు కొన్ని తీసి ఇచ్చి, వాటితో బంగారు బండి చేయించుకోమని చెప్పింది. కొంచెంసేపట్లో వర్ధమానుడు పెట్టె బండిని తెచ్చి బండి సిద్ధంగా ఉన్నదని వసంతసేనకు కబురు చేశాడు. వసంతసేన అలంకరించుకుంటున్నదనీ, ఆమె బయలుదేరటానికి కొంచెం వ్యవధి ఉన్నదనీ జవాబు వచ్చింది. తాను బండిలో మెత్తలు వెయ్యటం మరిచిపోయిన సంగతి ఆ సమయానికే జ్ఞాపకం వచ్చి వర్ధమానుడు అందుకోసమని బండి తీసుకుని, మళ్ళి వద్దామనుకుంటూ, వెళ్ళిపోయాడు.

చారుదత్తుడి ఇంటికి సమీపంలో వీధికి అడ్డంగా కొన్ని పల్లెటూరి బళ్ళు నిలిచాయి. కారణమేమంటే వాటిల్లో ఒక బండికి చక్రం ఊడి వచ్చింది.





ఇంతలో అక్కడికి ఇంకొక బండి వచ్చింది. దాన్ని శకారుడి నౌకరు తన యజమాని కోసం తీసుకుపోతున్నాడు. దారికి అడ్డంగా బళ్ళుండటం గమనించి శకారుడి బండివాడు తన బండిని చారుదత్తుడి ఇంటి గుమ్మం దగ్గిర ఆపి, చక్రం ఊడిన బండికి సహాయం వెళ్ళాడు.

సరిగా ఈ సమయంలో వసంతసేన అలంకరణ ముగించి గుమ్మం వద్దకు వచ్చి, అక్కడ నిలబడి ఉన్న పెట్టెబండి తన కోసమే ననుకుని, ఖాళీగా ఉన్న ఆ బండి లోకి ఎక్కి కూచుని తలుపులు మూసేసింది. త్వరలోనే పల్లెటూరి బండి బాగయింది, వీధి ఖాళీ అయింది. శకారుడి బండివాడు తిరిగివచ్చి బండిని సరాసరి శకారుడి తోటకు తోలుకుపోయాడు.

శర్విలకుడు చోరవిద్యలో ఘటికుడు గనక ఎలాగో చెరసాలలో జొరబడి, అక్కడి అధికారిని చంపి ఆర్యకుణ్ణి విడిపించాడు. రక్షకభటులు ఆర్యకుడి కోసం నగరమంతా ఘాలించసాగారు. ఆర్యకుడు వారిని తప్పించుకుని పారిపోతూ, చారుదత్తుడి ఇంటికేసి వచ్చి, దొడ్డివాకిలి తెరిచి ఉండటం చూసి లోపలికి వెళ్ళి దాక్కున్నాడు. ఇంతలో వర్ధమానుడు బండిలో మెత్తలు వేసి తెచ్చి, "బండి సిద్ధంగా ఉన్నదని వసంతసేనకు చెప్పండి," అని కేకపెట్టాడు. ఇది మంచి అవకాశమనుకుని ఆర్యకుడు బయటికి వచ్చి బండి ఎక్కి తలుపులు మూసేసుకున్నాడు. వర్ధమానుడు బండిని ఊరి బయట ఉండే చారుదత్తుడి తోటకు తోలుకుపోయాడు.

బండి వచ్చి చేరగానే చారుదత్తుడు ఆత్రంగా వచ్చి తలుపు తెరిచి లోపల ఆర్యకుడుండటం చూసి ఆశ్చర్యపోయాడు. ఆర్యకుడు శరణు వేడగా చారుదత్తుడు అభయమిచ్చి ఆ బండిలోనే ఎక్కడికైనా క్షేమ ప్రాంతానికి వెళ్ళమని చెప్పి పంపేశాడు.



అక్కడ శకారుడు తన స్నేహితుడితో బండి కోసం ఎదురుచూస్తున్నాడు. ఆ సమయానికి వారికి బౌద్ధ సన్యాసి అయిపోయిన సంవాహకుడు ఎదురయాడు; అతను తన కాషాయ వస్త్రాలను ఆ తోటలోని చెరువులో ఉతుక్కుని వస్తున్నాడు. శకారుడు అతన్ని తిట్టి, కొట్టి, చివరకు విడిచిపెట్టాడు. ఆ సమయంలోనే వసంతసేన ఎక్కిన బండి అక్కడికి వచ్చింది.

శకారుణ్ణి చూసి వసంతసేన ఎంత భయపడిందో, తలవని తలంపుగా వచ్చిన వసంతసేనను చూసి శకారుడంత సంతోషించి, ఆమెను కాళ్ళు పట్టుకుని బతిమాలబోయాడు. వసంతసేన చాచి ఒక్క తన్ను తన్నేసరికి శకారుడి ప్రేమ రోషంగా మారింది. ఆ దుర్మార్గుడు తన స్నేహితుడితో, "ఈమెను చంపెయ్యి, నీకు అడిగినంత ధనం ఇస్తాను," అన్నాడు. కాని ఆ స్నేహితుడు ఆ పని తనవల్ల కాదన్నాడు. బండివాడు కూడా అ మాటే అన్నాడు.

"నేను నవ్వులకన్నానుగాని నిజంగా చంపిస్తానా? మీరు ఇక్కడ ఉండటంచేత వసంతసేన బిడియపడుతున్నది. మీరు వెళ్లిపొండి," అని శకారుడు తన మిత్రుణ్ణీ, బండివాణ్ణీ పంపేసి, వసంతసేనతో మాటలు పెంచుకుని ఆమె గొంతు పట్టుకుని నొక్కేశాడు. వసంతసేన స్పృహ తప్పి పడిపోయింది. ఆమె చచ్చిపోయిందని శకారుడు అనుకున్నాడు.

త్వరలోనే అతని మిత్రుడూ, బండివాడూ తిరిగి వచ్చి, శకారుడు హత్య చేసినట్టు తెలుసుకున్నారు. మిత్రుడు తనను తిట్టి వెళ్ళిపోతూంటే శకారుడు, "వసంతసేనను చంపి ఎక్కడికి పోతావు?" అని బుకాయించాడు. మిత్రుడికి శకారుడంటే అసహ్యం వేసింది. అతను కత్తి చూపి శకారుణ్ణి భయపెట్టి, రాజుగారి ప్రతిపక్షం వారితో చేరటానికి వెళ్లిపోయాడు. బండివాడికి లంచం ఇవ్వ



పోతే వాడు తీసుకోలేదు. బండివాణ్ణి బండి తీసుకుని ఇంటికి పొమ్మని చెప్పి, శకారుడు వాణ్ణి తన ఇంట నిర్బంధించి ఉంచటానికీ, హత్యానేరం చారుదత్తుడిపైన వెయ్యటానికీ నిశ్చయించాడు.

తరవాత అతను వసంతసేన శరీరంపైన ఎండుటాకులు కుప్పగా పేర్చి వెళ్ళిపోయాడు. అంతలోనే బౌద్ధసన్యాసి మళ్ళీ అక్కడికి వచ్చాడు. తన కావి గుడ్డలు మట్టికాకుండా ఆరవేసేందుకు ఎండుటాకుల కుప్ప వాటంగా కనిపించింది. అతను బట్టలను దానిపై పరుస్తుండగా వసంతసేన కదిలింది.



బౌద్ధసన్యాసి ఆకులు తొలగించి వసంతసేనను చూసి ఆశ్చర్యపోయాడు. ఆమె ఒకప్పుడు తనను జూదరులనుంచి కాపాడింది. అతను ఆమెకు శైత్యోపచారాలు చేసి, ఆ సమీపంలో ఉండే బౌద్ధవిహారానికి తీసుకుపోయాడు.

శకారుడు న్యాయస్థానానికి వెళ్ళి, "వసంతసేనను నేను చంపలేదు. ఎవరో దుర్మార్గులు ఆమెను నా తోటలోకి తెచ్చి నగల కోసం చంపారు," అని ఫిర్యాదు చేశాడు.

న్యాయాధికారి తన ధర్మం ప్రకారం సాక్షులను పిలిపించి విచారణ సాగించాడు. వసంతసేన చారుదత్తుడి ఇంటికి వెళ్ళినట్టు ఆమె తల్లి చెప్పింది. చారుదత్తుణ్ణి అడిగితే వసంతసేన ఇంటికి తిరిగి వెళ్ళిపోయిందనీ, అప్పుడు ఇంటి వద్ద లేననీ చెప్పాడు.

ఈ విచారణ ఆరంభం కాకముందే మైత్రేయుడు వసంతసేన జాడ తెలుసుకోవటానికి బయలుదేరాడు. తన కొడుకు బంగారు బండి కొనుక్కునేటందుకై వసంతసేన ఇచ్చిన నగలను ఆమెకు తిరిగి ఇచ్చి రమ్మని అతనితో చారుదత్తుడు చెప్పాడు. మైత్రేయుడు ఆ నగలు పట్టుకుని వసంతసేన వార్తకోసం తిరుగుతూండగా దారిలో అతనికి చారుదత్తుడు న్యాయస్థానానికి పిలవబడినట్టు తెలిసింది. మైత్రేయుడు అక్క-



డికి పరిగెత్తాడు. అతని వద్ద ఉన్న వసంతసేన నగలు చారుదత్తుడి దోషాన్ని బలపరిచాయి. చారుదత్తుడే వసంతసేనను నగల కోసం హత్యచేసినట్టు నిశ్చయించి న్యాయాధికారి అతనికి కొరత శిక్ష విధించాడు.

చారుదత్తుణ్ణి వధ్యభూమికి తీసుకుపోయారు. అతను ఒక్కసారి తన కొడుకును చూడగోరాడు. రోహసేనుడు వచ్చి ఏడుస్తూ తలారులతో, "మా నాన్నను చంపకండి, నన్ను చంపండి," అన్నాడు.

ఈలోపల వసంతసేన బౌద్ధసన్యాసి సహాయంతో చారుదత్తుడి ఇంటికి బయలుదేరింది. తనను హత్య చేశాడని ఆరోపించి చారుదత్తుణ్ణి కొరత వేస్తున్నారని ఆమెకు దారిలో తెలిసింది. ఆమెకూడా వధ్యభూమికి వచ్చింది. "చంపకండి! నేను బతికే ఉన్నాను," అని ఆమె పెట్టిన కేక విని తలారులు చారుదత్తుణ్ణి అక్కడే ఉంచి, రాజుకు ఈ సంగతి చెప్పబోయారు.

వసంతసేనను ప్రాణాలతో చూడగానే శకారుడు భయపడి పారిపోబోయాడు. కాని తలార్లు అతన్ని పట్టుకున్నారు. చారుదత్తుడితో వసంతసేన జరిగిన సంగతిఅంతా చెప్పింది.

ఇదే సమయంలో అర్యకుడు యజ్ఞవాటికలో ఉన్న రాజును చంపేశాడు. ఇప్పుడు ఆర్యకుడే రాజు. తనను కాపాడిన కృతజ్ఞతకొద్దీ అతను చారుదత్తుడికి వేణాతీరాన గల కుశావతీ రాజ్యాన్ని ఇచ్చేశాడు. ఈ విషయాలన్నీ శర్విలకుడు వచ్చి చారుదత్తుడికి చెప్పాడు.

చారుదత్తుడు వసంతసేనను వెంటబెట్టుకుని తన ఇంటికి వెళ్లేసరికి ధూతాంబ, తన భర్త మరణశిక్ష పొందాడనుకుని, సహగమనం చేసే ప్రయత్నంలో ఉంది. అందరి కష్టాలూ గట్టెక్కాయి. చివరకు శకారుణ్ణి కూడా చారుదత్తుడు విడిచి పుచ్చాడు. అతను తన భార్యతోనూ, వసంతసేనతోనూ, కొడుకుతోనూ సుఖంగా ఉన్నాడు.





# చిత్రకారుల యుక్తి

పూర్వం జయ విజయులని ఇద్దరు చిత్రకారులుండేవారు. వారు ప్రతిభావంతులు. వారు ఏ కొత్త మనిషినైనా సరే కొద్దిసేపు చూసి ఆ మనిషి రూపం చిత్రించగలిగేవారు. తాము చూడని మనిషిని సైతం, వర్ణించగా విని, ఎరిగినవాళ్ళు పోల్చుకునేలాగ చిత్రించగలిగేవారు.

వారు తమ అపూర్వ శక్తులను అనేక రాజాస్థానాలలో ప్రదర్శించి ఎన్నో బిరుదులూ, బహుమానాలూ పొందుతూ దేశాటన చేశారు.

ఒకనాడు వారు మాధవవర్మ అనే రాజు యొక్క ఆస్థానానికి వచ్చి అక్కడకూడా తమ ప్రజ్ఞను ప్రదర్శించారు.

మాధవవర్మ వారితో, "మీరు ప్రతిభావంతులని నేను నమ్ముతున్నాను. అయితే మీకొక చిన్న పరీక్ష పెడతాను. అన్నిరకాల జ్ఞానం కంటె కూడా ఆత్మజ్ఞానం గొప్పదని పెద్దలు చెబుతారు. ఇది కళలలో కూడా నిజమేనని నా ఉద్దేశం. మీరు నిజంగా ప్రతిభావంతులే అయితే మీరు మీ చిత్తరువులనే వేసి నాకు చూపించండి. అవి వాస్తవాన్ని పోలి ఉన్నట్టయితే నేను మీకు నిజంగా మంచి బహుమానం యిచ్చి సత్కరిస్తాను," అన్నాడు.

ఈ మాటలకు జయ విజయులు తెల్లబోయినట్టు కనపడ్డారు.

"మీరు తరుచు మీ ముఖాలను అద్దాలలో చూసుకుంటూనే ఉంటారుగదా! ఆ ముఖాలను చిత్రించటం మీకేమంత కష్టం? అలా కనిపించి వెళ్ళిపోయిన దాసీ దాని చిత్తరువు అచ్చు గుద్దినట్టు వేశారే! అంతకన్న ఇది కష్టమైన పనికాదు," అన్నాడు మాధవవర్మ.

జయ విజయులు ఒకరినొకరు చూసుకున్నారు. ఒకరి ముఖాలొకరు పరీక్షించు

టి. తాతారావు, B. Com.

కున్నారు. వారి కళ్ళు ఏమో మాట్లాడు కున్నాయి.

"సరే, మహారాజా! ఈ పరీక్షకు మేము నిలబడతాం!" అన్నారు వారు.

రాజుగారు నౌకర్లను పిలిపించి, "ఈ చిత్రకారు లిద్దరినీ చెరొక గదిలోనూ ఉంచి, చిత్రాలు పూర్తి అయినాక వాటిని నా వద్దకు తీసుకురండి. వారుండే గదులలో అద్దాలు గాని అద్దాల లాటివిగాని ఏమీ లేకుండా చూడండి," అన్నాడు.

రాజుగారి నౌకర్లు వారిని చెరొక ఖాళీ గదికీ తీసుకుపోయారు.

ఎవరి ముఖం వారు చిత్రించటం సులువైన పనికాదు. అద్దంలో చూసుకున్నప్పటికీ ప్రతిబింబాలలో కుడి ఎడమలు వ్యత్యాసంగా ఉంటాయి. ఆ కారణంచేత, జయ విజయులు ఎవరిముఖం వారు వేసుకోవటానికి ప్రయత్నించినట్టయితే ఫలితం సరిగా ఉండేదికాదు.

అయితే వారు ఆ పని చెయ్యటానికి ప్రయత్నించ లేదు. జయుడి ముఖాన్ని విజయుడూ, విజయుడి ముఖాన్ని జయుడూ చిత్రించ నారంభించారు.

ఒక్క ఘడియలోపల ఇద్దరి చిత్రణా ముగిసింది.

వారు తమ తమ చిత్రాలను వేరువేరు పెట్టెలలో పెట్టి నౌకర్లకిచ్చి వాటిని రాజుగారి వద్దకు పంపించారు.

రాజుగారి చేతికి అందగానే రెండు పెట్టెలూ కలిసిపోయాయి. ఆయన వాటిలో ఉన్న రెండు చిత్తరువులనూ చెరొక చేత్తోనూ పట్టుకుని వాటిలో గల వాస్తవ చిత్రణకు దిగ్భ్రమచెందిపోయాడు.

చిత్రకారులు చేసిన యుక్తి ఆయనకు స్ఫురించనేలేదు.

ఆయన జయ విజయులను సభకు రావించి, వారి శక్తిని ఎంతో కొనియాడి, ఇద్దరికీ ఘనంగా సన్మానంచేసి పంపించేశాడు.



# నమ్మినవాణ్ణే మొత్తాలి!

ఒక ఊరి వెలపల ఒక పాడుపడిన గుడీ, దాని పక్కన గ్రామదేవత విగ్రహమూ ఉన్నాయి. ఒకనాడు ఒకడు ఆదారిగా వెళుతూ, ఒక మురుగు కందకం దాటవలసి వచ్చేసరికి, ఆ దేవత విగ్రహాన్ని కందకానికి అడ్డంగావేసి, దానిమీదుగా దాటి వెళ్ళాడు.

తరవాత ఇంకొక బుద్ధిమంతుడు అటుగా వచ్చి, విగ్రహం కందకానికి అడ్డంగా ఉండటం చూసి నొచ్చుకుని, దాన్ని ఎత్తి నిలబెట్టాడు.

"కొబ్బరికాయ అయినా కొట్టకుండా నన్ను తాకి పోతావుట్రా, దుర్మార్గుడా? తలనొప్పితో బాధపడు!" అని అమ్మవారు వాణ్ణి శపించింది.

సాటి దేవతలు, "తొక్కిపోయిన వాణ్ణి ఊరికే పోనిచ్చి, నిన్ను ఎత్తి నిలబెట్టిన వాడిమీద అలుగుతావేమిటి?" అని అడిగారు.

"నమ్మనివాణ్ణి ఏం చెయ్యగలను? మొత్తితే నమ్మినవాణ్ణే మొత్తాలి!" అన్నది గ్రామదేవత.





# కొత్త అమల్దారు

కర్ణాటకదేశాన్ని పాలించిన చాముండ రాయుల వద్ద గుండప్ప అనే పురోహితుడుండేవాడు. రాజకుటుంబం జరిపే పూజావిధులన్నిటినీ గుండప్ప సమర్థతతో జరిపిస్తూ ఉండేవాడు.

ఒకనాడు చాముండరాయులు గుండప్పతో, "ఏమయ్యా, నీవు ఇంతకాలంగా మాకు పురోహితుడివిగా ఉండి వైదిక కర్మలన్నీ ఎంతో చక్కగా జరిపిస్తున్నావు. నాకు చాలా సంతోషమయింది. నీ మనసులో ఏదైనా కోరిక ఉంటే చెప్పు, నేను తీరుస్తాను," అన్నాడు.

వెంటనే గుండప్ప, "మహారాజా, నాకు వేరే కోరిక ఏమీ లేదుగాని తమ రాజ్యంలో ఏదన్నా ఒక జిల్లాకు నన్ను అమల్దారుగా వేసినట్టయితే ప్రజలమీద పెత్తందారీ చెయ్యాలని ఉన్నది. అనుకూలమైన పక్షంలో నా కోర్కె తీర్చండి," అన్నాడు.

"అలాగే కానీ," అన్నాడు రాజు చాలా సంతోషంగా.

ఆ సమయంలో నంజనగూడు జిల్లాకు అమల్దారును నియమించవలిసిన అవసరం ఏర్పడిఉన్నది. ఆ ఖాళీలో గుండప్పను నియోగించాడు రాజు.

బ్రాహ్మడూ, జ్ఞానీ అయిన వాడు గనక తన పురోహితుడు ఆ అమల్దారు పదవిని మరింత శక్తివంతంగా నిర్వహిస్తాడని రాజు ఆశించాడు.

అయినా గుండప్ప రాజకుటుంబానికి పౌరోహిత్యం చేశాడేగాని అధికారంతో కూడిన ప్రభుత్వోద్యోగం చేసినవాడుకాడు. అందుచేత ఆయనకు రాజు కొన్ని సూచనలు చేశాడు. అవి ఏవంటే:

అమల్దారు అయినవాడు ఎప్పుడూ ముఖం మాడ్చుకుని ఉండాలి. (అనగా, నవ్వుతూ ఉల్లాసంగా ప్రజలకు కనపడరాదని భావం.)

ఆర్. శంకరరావు

అందరి చెవులూ కొరకాలి. (అంటే ఎవరితో మాట్లాడినప్పుడైనా మూడోవాడికి వినిపించకుండా రహస్య సంభాషణ చెయ్యాలని భావం.)

అందరి జుట్టూ చేతిలో ఉంచుకోవాలి. (అందరి లోపాలూ తెలుసుకుని ఉంచుకుని వాళ్ళు తోక ఝాడించటానికి లేకుండా చూసుకోవాలని అర్థం.)

రాజు తనకు సంగ్రహంగా చేసిన ఈ మూడు సూచనలనూ గుండప్ప శ్రద్ధగా ఆలకించి, "మహారాజా, అర్థమయింది! గ్రహించాను!" అన్నాడు.

తరవాత ఆయన రాజుగారి వద్ద ఉద్యోగ పత్రం పుచ్చుకుని, వస్తానని చెప్పి సెలవు తీసుకుని, పుట్టెడు సంతోషంతో ఇంటికి వచ్చేశాడు. గుండప్ప ఇంటికి వెళ్ళగానే రాజు నంజనగూడుకు కొత్త అమల్దారు వస్తున్నట్టు వార్త పంపాడు.

కొత్త అధికారికి స్వాగతం చెప్పటానికి నంజనగూడులోని రాజోద్యోగులు పెద్దఎత్తున ప్రయత్నాలు చేసి నగరం వెలపల అతడి కోసం కాచి ఉన్నారు.

ఈలోపల గుండప్ప తన ప్రయాణానికి ఒక మూట సిద్ధం చేసుకున్నాడు. అందులో ఆరుమూళ్ళ పంచెలూ, పన్నెండుమూళ్ళ



పంచెలూ కట్టుకుని, ఆ మూటను నెత్తిన పెట్టుకుని, తెల్లవారుగట్టనే బయలుదేరి కాలి నడకను నంజనగూడు దారి పుచ్చుకున్నాడు. దారిలో నవనవలాడే దర్భలు కనిపించినప్పుడల్లా గుండప్ప అలవాటు ప్రకారం వాటిని కోసి కట్ట కట్టుకున్నాడు.

నెత్తిన బట్టల మూటా, చేతిలో దర్భకట్టలూ పట్టుకుని గుండప్ప నంజనగూడు చేరుకున్నాడు.

అప్పటికి అపరాహ్ణమయింది. కొత్త అమల్దారుకు స్వాగతం చెప్పవచ్చిన వారందరూ తిండీ తిప్పలూ లేకుండా నగరద్వారంవద్ద వేచి ఉన్నారు. వారు గుండప్పను చూసి

పురోహితుడే అనుకున్నారుగాని కొత్త అమల్దారనుకో లేదు. అయినా ఈ పురోహితుడు అమల్దారు రావలిసిన దారినే వస్తున్నాడు గనక, అమల్దారుగారు మధ్య మార్గంలో మజిలీ చేశారో లేక సరాసరి వచ్చేస్తున్నారో అడిగి తెలుసుకుందామనుకున్నారు.

అమల్దారుగారి కింది అధికారి గుండప్పను సమీపించి, "అయ్యా, అమల్దారుగారి కోసం ఎదురుచూస్తున్నాం. వారి సమాచారం తమకేమైనా తెలుసునా?" అని అడిగాడు.

వెంటనే గుండప్ప నెత్తిమీది నుంచి మూట దించి, తన ధోవతి కొంగుకు కట్టి బొడ్డులో దోపుకున్న అధికార పత్రాన్ని తీసి తన కింది అధికారి చేతిలో రెండు దర్భపుల్లలతోసహా ఉంచాడు.

ఇటువంటివాణ్ణి అమల్దారుగా నియోగించారేమిటా అని ఉద్యోగులందరూ విస్మయం చెందారు. అయినా అధికార పత్రం ప్రకారం ఆయన తమ అమల్దారు గనక, గుండప్పను మేళతాళాలతో నగరంలోకి ఊరేగించుతూ తీసుకుపోయారు.

గుండప్పను ఆయన కింది అధికారి తన ఇంటికి తీసుకుపోయి భోజనం పెట్టాడు. పొద్దుటి నుంచీ పచ్చి మంచి నీళ్ళుకూడా తాగకుండా ఉండిన గుండప్ప సుష్టుగా



భోజనంచేసి, "తాంబూలం ఏదీ?" అని అడిగాడు.

అధికారి తాంబూలం తెప్పించాడు. "మరి దక్షిణో?" అని గుండప్ప అడిగాడు.

గుండప్ప పురోహితుడనీ, దక్షిణ తాంబూలాలు అడిగి పుచ్చుకోవటం ఆయన ఆచారమనీ అధికారికి తెలియదు. కొత్త అమల్దారు తనను అప్పుడే లంచం అడుగుతున్నాడని ఊహించుకుని, ఒక సంచీలో అయిదు వందల మొహరీలు పోసి తెచ్చి గుండప్పకు ఇచ్చుకున్నాడు. ఏ రూపాయో, రెండో ముట్టుతుందనుకున్న గుండప్ప సంచీ విప్పి చూసి నిర్ఘాంతపోయి, "బాగుంది! నే నొక్క ఘడియలో కచ్చేరీకి బయలుదేరి వస్తున్నాను. మీరంతా మీమీ పనులు చూసుకుంటూ ఉండండి!" అని అధికారితో చెప్పాడు. అధికారి కచ్చేరీకి వెళ్లిపోయాడు.

అప్పుడు గుండప్ప తాపీగా కూచుని రాజుగారు తనకు చేసిన సూచనలను మననం చేసుకున్నాడు. అందులో మొదటిది ముఖం మాడ్చుకోవటం. ఇది ఎలాగో గుండప్పకు అర్థంకాలేదు. చివరకాయన ఇంత కాటుక తెప్పించి ముఖానికి పూసుకుని కచేరీకి వెళ్ళాడు. ఆయన ఆకారం చూసి కచేరీలో అందరూ కంగారుపడ్డారు, కాని ఏమీ అనలేకపోయారు.



రాజు చేసిన రెండవ సూచన ఉద్యోగుల చెవులు కొరకటం. గుండప్ప ఉద్యోగస్తులలో ఒకణ్ణి దగ్గిరికి రమ్మని పిలిచాడు. వాడు వచ్చాడు. ఇంకా దగ్గిరికి రమ్మన్నాడు గుండప్ప. కొత్త అమల్దారు తనకేదో గొప్ప రహస్యం చెప్పబోతున్నాడని ఊహించి ఆ ఉద్యోగి తన చెవిని గుండప్ప నోటి దగ్గిరికి తెచ్చాడు.

వెంటనే గుండప్ప వాడి చెవి కసిక్కున కొరికాడు. వాడు బాధతో కెవ్వున కేక పెట్టాడు.

ఇంకొక్క సూచన మిగిలి ఉన్నది. అందరి జుట్టూ తన చేతిలోకి రావాలి. ఇందు కోసం గుండప్ప వేచి ఉన్నాడు.

పొద్దు పోతున్నది. ఎంతకీ కొత్త అమల్దారు లేవకపోవటం చూసి మిగిలిన ఉద్యోగులుకూడా తమ స్థానాలలో కూచున్నారు. ఎంత ఆపుకోవాలని ప్రయత్నించినా, వారికి నిద్ర ముంచుకు వస్తున్నది.

చివరకు అర్ధరాత్రి అయింది. కచేరీలోని ఉద్యోగులు ఎవరిస్థానాలలో వారు నిద్ర పోయారు. అదే సమయమని గుండప్ప తన స్థానంలోనుంచి లేచి, ఒక కత్తెర తీసుకుని అందరి జుట్టూ కత్తిరించి తన చేత పట్టుకుని తన బసకు వెళ్ళిపోయాడు.

తాను రాజుగారి సూచనలను తూచా తప్పకుండా పాటించిన సంగతి రాజుగారికి విన్నవించి ఆయన మెప్పు పొందుదామని గుండప్ప మర్నాడు తెల్లవారుఝామునే బయలుదేరి వెళ్ళాడు.

గుండప్ప చెప్పినదంతా విని రాజుగారు తన చెవులను తానే నమ్మలేకపోయాడు. ఇంతలో నంజనగూడు నుంచి ఒక ఉద్యోగి వచ్చి కొత్త అమల్దారు ప్రవర్తన గురించి రాజుగారికి నివేదించుకున్నాడు. పౌరోహిత్యం చేసుకునే వాణ్ణి అమల్దారుగా పంపటం తనదే తప్పని గ్రహించి రాజుగారు గుండప్పకు తిరిగి పౌరోహిత్యం ఇచ్చేశాడు.






# పాపాలకు మూలం

పట్టువిడవని విక్రమార్కుడు మళ్ళీ చెట్టు వద్దకు వెళ్ళి, చెట్టు నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, మానవులు పడే పాట్లన్నిటికీ స్త్రీలే కారణమంటారు. కాని నీవు పడే శ్రమకు ఆడది కారణమైనట్టు నాకు తోచటం లేదు. అయినప్పటికీ, ఆడ వాళ్ల మూలంగా మగవాళ్ళు ఎలా పాపిష్టి వాళ్లయిపోయేదీ తెలియజేసే ఒక కథను నీకు చెబుతాను. శ్రమ తెలియకుండా ఉండగలందులకు దాన్ని విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

ఒకప్పుడు మాండవ్య మహాముని తపస్సు చేసుకుంటుండగా రాజభటులు దొంగను వెతుకుతూ వచ్చి, మాండవ్యుడే దొంగ అనుకుని ఆయనను తీసుకుపోయి కొరత వేశారు. దేహం చాలించిన పిమ్మట మాండ వ్యుడు యముడి వద్దకు వెళ్ళి, ఆయనను,

## బేతాళ కథలు

"నాకీ కొరతబాధ ఎందుకు కలిగించావు?" అని అడిగాడు.

"నీవు చిన్నతనంలో తూనీగలను ముళ్లతో గుచ్చి బాధించావు, అందుచేత నీకు కొరతబాధ కలిగించాను," అని యముడు జవాబిచ్చాడు.

"అజ్ఞానంతో చేసిన ఆ చిన్న తప్పుకు ఇంత శిక్ష విధిస్తావా? నీవు శూద్రుడవుగా మానవజన్మ ఎత్తు," అని మాండవ్యుడు యముణ్ణి శపించాడు. ఆ శాపఫలం అనుభవించటానికి యముడు విదురుడుగా జన్మించాడు. అతడు భూమిపైన ఉన్న నూరేళ్ల కాలమూ అర్యముడనే ఆదిత్యుడు యముడి పని నిర్వహిస్తూవచ్చాడు. యముడు ప్రాణుల కిచ్చే శిక్షలను నిర్ణయించటంలో పొరపాటు చేసినందువల్లనే ముని శాపానికి గురి అయినందువల్ల అర్యముడు యమలోకానికి వచ్చి నరకబాధలు అనుభవించే వారి పాపాలను గురించీ, పాపకారణాలను గురించీ ఎంతో శ్రద్ధగా విచారిస్తూవచ్చాడు.

ఇలా చేసినందువల్ల అర్యముడికి ఒక వింత సంగతి తెలియవచ్చింది: నరకబాధలు అనుభవించటానికి వచ్చిన వారిలో నూటికి తొంభైమంది పాపులు, తాము స్త్రీల మూలానే పాపకార్యాలు చేశామంటూ వచ్చారు. దాదాపు ప్రతి పాపీ ఇదే మాట



అంటూ ఉండటంచేత అర్యముడికి ఇందులో కొంత నిజం ఉన్నదేమోనని పించింది. యముడు నూరేళ్ల కాలం భూలోకంలో గడిపి, విదుర జన్మ ముగించి తన పదవికి తిరిగి రాగానే అర్యముడు ఆయనతో తాను తెలుసుకున్న విషయం కాస్తా చెప్పేశాడు.

యముడుకూడా ఈ విషయం దీర్ఘంగా యోచించాడు. ఎక్కువ పాపాలకు స్త్రీలే కారణమైనట్టయితే పాపులను అంత కఠినంగా శిక్షించటం అధర్మమవుతుంది. మగవాళ్ళు చేసే పాపాలకు కొంత శిక్ష స్త్రీలు కూడా పొందవలిసి ఉంటుంది.

యముడికి తన చిన్ననాటి విషయం జ్ఞాపకం వచ్చింది. ఆయన తల్లి సంజ్ఞాదేవి యముణ్ణి కన్న తరవాత తన భర్త అయిన సూర్యుడి వద్ద తన ఛాయను వుంచి తాను పుట్టింటికి వెళ్లిపోయింది. తరవాత ఛాయ యముణ్ణి సవతి కొడుకులాగా చూస్తూ తన సొంత పిల్లలను ఎక్కువగా చూసింది. ఇది సహించలేక యముడు ఆమెను తన్నాడు. యముడి కాలు విరిగి భూమిపై పడేలాగ ఛాయ శపించింది. తరవాత యముడు తన తండ్రి అయిన సూర్యుడి అనుగ్రహంతో ఎలాగో ఆ శాపం నుంచి విముక్తుడు కావలిసి వచ్చింది.





ఇదంతా జ్ఞాపకం చేసుకుంటే యముడికి కూడా, ఒకవేళ స్త్రీలే అనేక పాపాలకు మూలకారణమేమో అన్న సందేహం కలిగింది. అయినప్పటికీ తగిన విచారణ లేకుండా ఏ నిర్ణయానికి రాగూడదు. అందుచేత యముడు తన అనుచరులలో ఒకడైన చండుడనేవాణ్ణి పిలిచి, "నాయనా, చండా! నువు పదేళ్లపాటు మనిషివిగా భూలోకంలో చరించి పురుషులు చేసే పాపాలకు మూలకారణం స్త్రీలు అవునో కాదో స్పష్టంగా తెలుసుకురావాలి. మనుషులకు డబ్బు అవసరం. అందుచేత నీకు ఒక లక్ష బంగారు దీనారాలిప్పిస్తాను. అక్కడఉండే కాలంలో నీకు దేవతాశక్తులేవీ ఉండవు. మామూలు మనిషిలాగే బతుకు. తగిన కన్యనుగా చూసి పెళ్లాడు. సంసార జీవితం గడుపు. నీ పుణ్య పాపాలు చిఠా వెయ్య వద్దని చిత్రగుప్తుడితో చెబుతాను. తెలిసిందా?" అన్నాడు.

మానవలోకంలో పది సంవత్సరాలుండటమంటే చండుడికి మనస్కరించలేదు. కాని యముడు చేసే ధర్మనిర్ణయం తన పైన ఆధారపడపోతున్నదని గ్రహించాక అతను మానవుడు కావటానికి సంతోషంగా ఒప్పుకున్నాడు.

యముడు చండుణ్ణి ముప్పై ఏళ్ల అందగాడుగా తయారుచేసి, ఒక లక్ష బంగారు దీనారాలిచ్చి, "భూమిపైన నీ యిష్టం వచ్చిన స్థలానికి వెళ్ళు," అన్నాడు.

చండుడు చండసింహుడని పేరు పెట్టుకుని ఏకంగా ఇంద్రప్రస్థంలో దిగాడు. దేవలోకానికి పోటీగా మయుడు నిర్మించిన ఆ మహానగరం ఆనాడు భరతవర్షానికంతటికీ మేటి పట్టణం. అక్కడ లేని వైభవం లేదు, నాగరికత లేదు.

చండసింహుడు ఆ నగరంలో నివాసం ఏర్పాటు చేసుకుని, తాను కాశ్మీరదేశపు వ్యాపారినని చెప్పుకుంటూ, మహాసంపన్నుడి

లాగా జీవితం గడపసాగాడు. నగరంలోని ఎందరో కులీనులు తమ కుమార్తెలను అతనికిచ్చి పెళ్ళి చెయ్యటానికి ప్రయత్నించారు. అతను సౌదామిని అనే కన్యను ఎంచి పెళ్ళాడాడు. ఎందుకంటే ఆమె చాలా అందగత్తె. వాళ్ళది చాలా గొప్ప వంశం. కాని సౌదామిని తండ్రి ఏమాత్రమూ ఆస్తిపరుడు కాడు; ఆయనకూ, ఆయన కొడుకులకూ, కూతుళ్ళకూ ఉన్న ఆస్తి యావత్తూ వారి వంశగౌరవమే.




సౌదామిని ఎంత అందమైనదో అంత అభిమానమూ, వంశాభిమానమూ కలది. తండ్రి ఇంట ఎంత బీదగా బతికినప్పటికీ ఆమె మనసులో చిన్న ఆలోచనలు కలిగేవి కావు. ఈ లక్షణాలన్నీ చూసి చండసింహుడు తన భార్యను ఎంతో ప్రేమగా చూస్తూ, పువ్వులలో పెట్టి పూజించాడు. ఆమె ఏ కోరిక కోరినా మరుక్షణం దాన్ని తీర్చేవాడు; ఎందుచేతనంటే అతని వద్ద పుష్కలంగా డబ్బున్నది.

పెళ్ళి అయి దారిద్ర్యబాధ ఏమిటో తెలియకుండా పోయినాక సౌదామినిలో చిత్రమైన మార్పు కలిగింది. భర్త తనకు దాసుడైనకొద్దీ అతన్ని మరింత దాసానుదాసుణ్ణి చేసుకున్నది. అతను తనను ఆకాశానికి ఎత్తినకొద్దీ అతనికి అందకుండా పోయింది. ఆమె కోరికలు ఆజ్ఞలుగా మారాయి. ఆమెకు వెనక ఉండిన ఆత్మాభిమానం పల్లమాలిన అహంకారంగా పరిణమించింది. అయినా చండసింహుడు ఆమె ఇష్టానుసారం జరగనిచ్చాడు. తాను ఆమె ఆజ్ఞలు పాలించటంవల్ల ఆమెకు కలిగే ఆనందం చూసి అతనుకూడా ముచ్చటపడేవాడు.

సౌదామిని తన భర్త వద్ద ధనపు పాతర ఉన్నట్టుగా ప్రవర్తించింది. తన చెల్లెళ్ళకు అత్యంత వైభవంగా పెళ్ళిళ్ళు చేయించింది. తన భర్తచేత సరుకులు కొనిపించి తన

అన్న లిద్దరినీ సముద్ర వ్యాపారంమీద పంపింది. ఇక ఏనాడు చూసినా చండ సింహుడి ఇల్లు రాజాధి రాజుల ఇళ్ళకు తక్కువలేకుండా వెలిగిపోవలిసిందే. పండ గలూ, పబ్బాలూ వస్తే వారి ఇంట జరిగే విందులు నగరంలో మరెక్కడా జరగ టానికి వీల్లేదు. ఇలా చండసింహుడు తెచ్చు కున్న డబ్బంతా అయిపోయింది. అయితే అతనికి నగరంలో అంతులేని పరపతి ఉండటంచేత అతని సంసారం నిర్విఘ్నంగా సాగిపోయింది.

ఇప్పుడు చండసింహుడికి తన భార్య కోరిన కోరికలన్నీ తీర్చే శక్తి లేదు. భర్త తనకు ఏమాత్రం అడ్డుపుల్ల వేసినా ఆమె కాళీ అవతారంలాగా అయిపోతున్నది. అందుచేత అతను భార్య ఎదటపడటానికే భయపడుతున్నాడు. అతని కిప్పుడు ఒక్కటే ఆశ—అతని బావమరుదులు సముద్రాల మీద లాభసాటి వ్యాపారం చేసుకుని తిరిగి వస్తే తన పరువు కొంత దక్కుతుంది. అందుకని వారి రాకకోసం అతడు ఎదురు చూడసాగాడు.

చివరకు వారు రానేవచ్చారు. ఒకడు సముద్రం మీద పడవ మునిగి, సరుకంతా నష్టమై చావు తప్పించుకుని ప్రాణాలతో ఇల్లు చేరుకున్నాడు. రెండోవాడు వ్యాపారం





చేసినంత చేసి, వచ్చిన డబ్బంతా అక్కడి కక్కడే తగలేసి, వట్టి చేతులతో ఇంటికి తిరిగివచ్చాడు.

చండసింహుడు ప్రజలను వంచించి, స్నేహితులను మొహమాటపెట్టి అప్పులు చేసి కొంతకాలం బతికాడు. భార్య అతనిపై బద్ధవైరం కట్టింది. బాకీదార్లు అతని దగ్గిర డబ్బులేదని తెలుసుకున్నారు. వాళ్లు అతన్ని తొందర చేయసాగారు. అతను కూడా చాతనయినమట్టుకు వారిని తప్పించుకు తిరగసాగాడు.

చివరకు వ్యవహారం న్యాయస్థానందాకా వెళ్ళింది. రాజభటులు అతన్ని పట్టుకు పోవటానికి వచ్చారు. చండసింహుడు తన గుర్రాన్ని ఎక్కి రాజభటులకు అందకుండా పారిపోసాగాడు. దారిలో కొందరు తనను పట్టుకోవటానికి వస్తే వారిని తన కత్తికి బలిచేశాడు.

తరవాత చండసింహుడు మారుపేరు పెట్టుకుని ఇతర దేశాలలో దొంగతనాలు చేసీ, హత్యలుచేసీ, తాగుబోతులతో జూదా లాడీ హేయమైన జీవితం గడిపి, తన గడువు పదేళ్లూ నిండగానే తిరిగి తన రూపంపొంది యమలోకానికి చేరుకున్నాడు.

యముడు అతన్ని చూస్తూనే, "వచ్చావా, చండా? నిజం ఏమిటో తెలుసుకున్నావా?



మగవాళ్ళు చేసే పాపాలకన్నిటికీ ఆడవాళ్ళేనా మూలకారణం? వారి బాధ్యత ఎంత?" అని అడిగాడు.

"స్వామీ, మగవాళ్లు చేసే పాపాలకు ఆడవాళ్ళు ఎంతమాత్రమూ కారకులు కారు. బాధ్యత అంతా మగవాళ్లదే!" అన్నాడు చండుడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, చండుడు యముడితో అలా ఎందుకు చెప్పాడు? సౌదామిని మూలంగానేకదా అతను అన్ని కష్టాలుపడి, అన్ని పాపాలూ చేసింది? బాధ్యత అంతా మగవాళ్లదే ననటంలో అతని ఉద్దేశం ఏమై ఉంటుంది? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "చండుడు చెప్పినదానిలో అబద్ధం ఏమీలేదు. అతని అనుభవంకూడా ఆ విషయాన్నే రుజువు చేస్తున్నది. పురుషులు తమ ఆనందం కోసం ఆడవాళ్లలో స్వార్థాన్నీ, అతిశయాన్నీ ప్రకోపింప జేస్తారు. వాటివల్ల తమకు చిక్కులు వచ్చినప్పుడైనా తమ తప్పు దిద్దుకోక పాపాలకు పూనుకుంటారు. చండసింహుడు దారిద్ర్యబాధ అనుభవిస్తూకూడా తన వద్ద డబ్బులేదని భార్యకు చెప్పలేదు. సౌదామిని దారిద్ర్యం ఎరగనిదికాదు. డబ్బు దుర్వ్యయం చెయ్యటంలో ఉండే ఆనందాన్ని చండసింహుడు తన తృప్తికోరకు ఆమెకు నేర్పాడు. ఆమెను ఆకాశానికెత్తి అహంకారం నేర్పాడు. ఆమెను యజమానురాలలాగా చూసి ఆమె తనను సేవకుడల్లే చూసేటట్టు చేసుకున్నాడు. దీనికంతకూ నిజంగా బాధ్యుడు చండసింహుడేగాని అతని భార్య ఎంతమాత్రమూ కాదు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)






# జలరాక్షసుడు

ఒకానొక దూర దేశంలో ఒక సరస్సుకు సమీపంలో ఒక కుటీరంలో ఒక పేదకాపు ఉండేవాడు. ఆ కాపుకు ముగ్గురు కొడుకులు. తల్లీ తండ్రీ పోయినాక పెద్దవాళ్ళిద్దరూ ఏకమై ఉన్న కొద్దిపాటి ఆస్తినీ ఒడుచుకున్నారు.

"ఈ ఇల్లు నాది!" అన్నాడు పెద్దవాడు.

"ఇంట్లో సామానంతా నాది!" అన్నాడు రెండోవాడు.

"మరి నామాట ఏమిటి?" అన్నాడు మూడోవాడు.

"నీకా? ఇల్లూ, ఇంటో సామానూ పోగా, ఏముంటే అది నీదే. వెతికి తీసుకో," అన్నారు అన్నలు.

మూడోవాడు ఇల్లంతా వెతికి ఒక మూల పడి ఉన్న తాటి చుట్ట సంపాదించాడు. దాన్ని వాడు తీసుకోవచ్చునని అన్నలు అనుమతించారు. ఆ తాడు భుజాన వేసుకుని కాపు కొడుకు సరస్సు తీరానికి వెళ్లాడు. వాడక్కడ నీటి ఒడ్డునే పెరిగే ఒక చెట్టు నానుకుని కూచుని తనకు బతుకుతెరువు ఏమిటా అని ఆలోచిస్తుండగా అంత దూరాన ఒక ఉడత కనిపించింది.

తనవద్ద ఉన్న తాడుతో ఉచ్చులు పన్ని రకరకాల జంతువులను పట్టుకుని, వాటి చర్మాలు అమ్మి బతకవచ్చునని వాడికి తోచింది. వాడు వెంటనే ఉచ్చు పన్ని ఉడతను పట్టుకున్నాడు. అయితే తీరా పట్టుకున్నాక వాడికి దానిని చంప బుద్ధి కాలేదు. అందుచేత ఒక చెక్కల గూడు చేసి వాడు ఉడతను అందులో పెట్టాడు.

అలాగే వాడు ఒక కుందేలునుకూడా ఉచ్చుల సహాయంతో పట్టుకుని దాన్నికూడా చెక్కల గూడులో పెట్టేశాడు.

వాడు ఆ సరస్సు ఒడ్డునే మకాం పెట్టి తన తాడుకు చిన్న ఉచ్చులూ, పెద్ద

వి. వెంకటదాసు



ఉచ్చులూ, ఇంకా పెద్ద ఉచ్చులూ అమర్చ సాగాడు. వాడు చూస్తూ ఉండగానే ఒక పెద్ద ఎలుగుబంటి వాడికి కొంచెం దూరంగా ఉన్న గుహలో ప్రవేశించింది.

కాపు కొడుకు అలా ఉచ్చులు అమర్చుతూ ఉండగా నీటి లోపల గలగల శబ్దం వినిపించింది. వాడు తల ఎత్తి చూసే సరికి నీటిలో నుంచి సగం పైకి వచ్చిన ఒక కుర్రవాడు ఒక రాయి పట్టుకుని దానిమీదుగా తనకేసి చూస్తూండటం కనిపించింది.

ఆ సరస్సు అడుగున ఒక జలరాక్షసు డుంటున్నాడు. వాడెప్పుడూ నీరు విడిచి బయటికి రాడు, కాని ఎవరైనా సరస్సు సమీపానికి వస్తే తన మాయోపాయాలచేత వారిని నీటిలోకి వచ్చేలాగు చేసి లోపలికి ఈడ్చేస్తాడు. వాడు ఎందరో ప్రయాణీకు లను ఆవిధంగా చంపేసి, అంతులేని బంగారం చేర్చిపెట్టాడని చెప్పుకునేవారు.

ఇప్పుడు తనను చూస్తున్నది ఆ జల రాక్షసుడి కొడుకై ఉండాలని కాపు కొడుకు గ్రహించాడు.

"మా సరస్సు దగ్గిర చేరి ఏంచేస్తు న్నావు?" అని రాక్షసుడి కొడుకు అడిగాడు.

"ఈ సరస్సుకు ఉచ్చువేసి బిగలాగ బోతున్నాను. అప్పుడు సరస్సు కాస్తా మూసుకుపోతుంది," అన్నాడు కాపు కొడుకు.

రాక్షసుడి కొడుకు బుడుంగున మునిగి తండ్రి దగ్గిరికి పోయి కాపు కొడుకు అన్న మాటలు చెప్పాడు.

"అంత పని చేస్తాడుగా? వాణ్ణి బతికి ఉండ నివ్వరాదు. నువు మళ్లీ పైకి వెళ్లి నీతోబాటు చెట్టు ఎక్కమని పందెం వెయ్యి. చెట్టెక్కి అలిసిపోయినాక వాణ్ణి నీటిలోకి తోసెయ్యి. మిగతా పని నేను చూస్తాను," అన్నాడు రాక్షసుడు తన కొడుకుతో.

రాక్షసుడి కొడుకు పైకి వచ్చి కాపు కొడుకుతో, "నాతోబాటు చెట్టెక్కు చూస్తాం!" అన్నాడు.

"నేను పని మీద ఉన్నాను, కళ్లు కన పడటంలేదూ? కావలిస్తే నా చిట్టి తమ్ముడితో వెయ్యి పందెం," అంటూ కాపు కొడుకు చెక్కల గూడులో నుంచి ఉడతను వది లాడు. రాక్షసుడి కొడుకు చెట్టుమీద చెయ్యి వెయ్యక ముందే ఉడత తుర్రున చిటారు కొమ్మకు పాకిపోయింది.

రాక్షసుడి కొడుకు మళ్లీ తండ్రి దగ్గిరికి పోయి ఇలా జరిగిందని చెప్పాడు.

"అయితే వాణ్ణి నీతో పరుగు పందానికి రమ్మను. వాణ్ణి సరస్సు చుట్టూ పరిగెత్తించి, అలుపురాగానే లోపలికి తోసెయ్యి," అన్నాడు రాక్షసుడు.

రాక్షసుడి కొడుకు మళ్ళీ పైకి వచ్చి, "పోనీ నాతో పరుగు పందెం వెయ్యి!" అన్నాడు.

"కళ్ళులేవూ? పనిమీది ఉన్నాను. కావ లిస్తే నా బుల్లి తమ్ముడితో వెయ్యి పందెం!" అంటూ కాపు కొడుకు కుందేలును వది లాడు. వదిలిందే ఆలస్యంగా అది వాయు వేగంతో బయలుదేరి క్షణంలో మాయ మయింది.

రాక్షసుడి కొడుకు మళ్ళీ తండ్రి దగ్గిరికి పోయి జరిగింది చెప్పాడు. "అలాగా! ఇదేదో మహచిత్రంగా ఉందే! అయితే



ఈసారి వాడితో మల్లయుద్ధం చేసి చితక గొట్టి నీటిలోకి తొయ్యి!" అన్నాడు రాక్షసుడు.

వాడి కొడుకు పైకి వచ్చి కాపు కొడు కుతో, "నాతో మల్లయుద్ధం చేస్తావా?" అని అడిగాడు.

"చేతిలో పని ఇంకా పూర్తికాలేదు. అ కనిపించే గుహలో మా తాత ఉన్నాడు. ఆయనతో మల్లయుద్ధం చెయ్యి. నువు గిలిస్తే అప్పుడు నీ సంగతి నేను చూస్తాను," అన్నాడు కాపు కొడుకు.

రాక్షసుడి కొడుకు ఎలుగుబంటి ఉండే గుహలోకి వెళ్లి దాన్ని కవ్వించాడు. ఎలుగు బంటి వాణ్ణి పట్టి పీకి, రక్కి వదిలిపెట్టింది.

వాడు ఎలాగో చావు తప్పించుకుని పారిపోయి తండ్రిని చేరుకుని జరిగినదంతా చెప్పాడు.

జలరాక్షసుడికి భయం పట్టుకున్నది.

"వీడెవడో ఉద్దండుడల్లే ఉన్నాడే! వీడి తమ్ములు చెల్లెక్కటంలోనూ, పరిగెత్తటం లోనూ నిన్ను మించిన వాళ్ళంటివి! వీడి తాత నిన్ను చంపినంతపని చేశాడాయె! వీడు మన సరస్సును ఊచ్చువేసి నిజంగానే మూస్తాడేమో! ఎంత బంగారం ఇస్తే వీడు మన సరస్సును వదిలి పోతాడో అడిగిరా!" అన్నాడు రాక్షసుడు కొడుకుతో.

వాడు వెళ్ళి కాపు కొడుకును అడిగాడు.

"నువు బంగారం తీసుకురా! చూసి చెబుతాను," అన్నాడు కాపు కొడుకు.

రాక్షసుడి కొడుకు కొంత బంగారం తెచ్చాడు. అది చాలదన్నాడు కాపు కొడుకు. వాడు వెళ్లి మరికొంత తెచ్చాడు. కాపు కొడుకు తృప్తిపడ లేదు. రాక్షసుడు ప్రాణం విసిగి తన దగ్గిర ఉన్నదంతా పంపేశాడు.

"ఇంతకంటె మా దగ్గిర చిన్నమెత్తు కూడా బంగారం లేదు!" అని రాక్షసుడి కొడుకు చెప్పిన మీదట కాపు కొడుకు ఆ బంగారమంతా తీసుకుని తన తండ్రి ఇంటికి వెళ్ళాడు.

"ఎక్కడిదిరా నీ కింత బంగారం?" అని అన్నలు ఆశ్చర్యంగా అడిగారు.

"ఈ తాడుతో సంపాదించుకున్నాను," అన్నాడు తమ్ముడు.

"ఈ ఇల్లూ, ఇంట్లో సామానూ తీసుకుని మాకు ఆ తాడు ఇచ్చెయ్యి," అని అన్నలు తమ్ముణ్ణి బతిమాలారు.

తమ్ముడు ఇచ్చేశాడు. వాడు తన తండ్రి ఇల్లు బాగుచేయించుకుని, తన బంగారంతో పొలాలూ, గొడ్డూ గోదా ఏర్పాటుచేసుకుని సుఖంగా ఉన్నాడు.

వాడి అన్నలు ఆ తాడు తీసుకుని ఎటుగా వెళ్ళారో ఏమైపోయారో ఈనాటికీ ఎవరికీ తెలియదు.





"ఏరా చిన్నా! మా సీతిని పెళ్ళాడ తావురా?"

"అబ్బే కుదర్దండీ. మా యింట్లో అంధరం చుట్టాలనే పెళ్లి చేసుకుంటాం. మా నాన్న అమ్మనీ మా తాతయ్యేమో అమ్మమ్మనీ మా బావ మా అక్కనీ చేసుకున్నారు."



"ఏవిట్రా ఆ బొమ్మా?"

"దేముడి బొమ్మలే."

"దేవు డెలా ఉంటాడో ఎలా తెలుస్తుందిరా?"

"హుఁ. ఇప్పుడు నేను వేస్తానుగదా. అది చూశాక తెలుస్తుంది."



"అదేవిట్రోయ్, ముక్కుమూసుకు తాగుతున్నావు, పాయసం?"

"మరీ ముక్కు మూసుకోపోతే వాసనేస్తుందిగదా. వాసనేస్తే నేమో నోరూరుతుంది. నోరూ రాకా తాగితే నేమో నీళ్ళు కలిసి పరవాణ్ణం పల్సగా అయిపోదూ?"




"రాత్తిరేం, యింత పెద్ద దెయ్యాం చూశానురా. బలే బయపడి పోయానులే."

"అది గోడమీద నీ నీడ అయివుంటుంది. అందికే దెయ్యాంలా వుంది"

—ఎస్. శంకరనారాయణ, మద్రాసు.




# బింబ ప్రతిబింబాలు

విశాలనగరంలో వివేకవంతుడనే రాజు ఉండేవాడు. ఆయన ప్రతి ఉదయమూ, సాయంకాలమూ తన భవనం పై భాగానికి వెళ్ళి, అక్కడ చల్లగాలిలో పచారు చేస్తూ సూర్యోదయ శోభా, సూర్యాస్తమయ శోభా తిలకిస్తూ ఉండేవాడు.

ప్రతిరోజూ ఒక కట్టెలు కొట్టేవాడు ఉదయంపూట రాజప్రాసాదం పక్కగా కట్టెలు కొట్టటానికి అడవికి వెళ్ళి, తిరిగి సాయంకాలంపూట కట్టెల మోపుతో తిరిగి వచ్చేవాడు.

ప్రతి ఉదయమూ, సాయంకాలమూ వాడు రాజుకు కనిపిస్తూనే ఉండేవాడు. అయితే వాడు ఉదయంపూట అడవికి పోతూ కనిపించినప్పుడు రాజుకు, "అయ్యో, పాపం! వీడు ఎంత కటిక దరిద్రుడోగద! అసలే ఎముకల గూడులా ఉన్నాడు; ఇంత శ్రమపడితేగాని వాడికి రోజు గడవదు కాబోలు!" అనుకుని జాలి పుట్టుకొచ్చేది. సాయంకాలంపూట వాడు మోపు నెత్తిన పెట్టుకు వస్తూ కనిపించినప్పుడు మటుకు రాజుకు వాణ్ణి చూడగానే ఎందుకో పట్టరాని ఆగ్రహం వచ్చేది; "పాపాత్ముడు, వీణ్ణి నిలువునా చీల్చినా దోషం లేదు!" అనిపించేది.

ఒకే మనిషిని చూస్తే తనలో ఉదయం ఒక భావమూ, సాయంకాలంపూట దానికి విరుద్ధంగా ఇంకొక భావమూ, ఎందుకు కలుగుతున్నదీ రాజుకే అర్థంకాక ఆశ్చర్యం వేసింది.

చివరకాయన తన మంత్రిని పిలిచి, అతనితో తన అనుభవం చెప్పి, తనలో ఈ విరుద్ధ భావాలు కలగటానికి కారణం ఏమై ఉంటుందో తెలుసుకోమన్నాడు.

మంత్రి సరేనని మూడురోజులు వ్యవధి కావాలని అడిగాడు.

చామర్తి కూర్మాచార్యులు

మర్నాడు మంత్రి పేదవాడి వేషం వేసుకుని కట్టెలుకొట్టేవాణ్ణి అనుసరించి అడవికి పోయి వాడు రోజల్లా పడే శ్రమ చూసి సాయంకాలం వాడి వెనకనే తానుకూడా వచ్చేశాడు.

రాజుగారు ఆ కట్టెలు కొట్టేవాణ్ణి చూసి ఎందుకు జాలిపడుతున్నదీ మంత్రికి అర్థమయింది; కాని రాజుకు వాడంటే ఆగ్రహం ఎందుకు వస్తున్నదీ తెలియరాలేదు.

రెండోనాడు మంత్రి ఒక సాధువు వేషం వేసుకుని కట్టెలు కొట్టే వాడి ఇంటికేసి వెళ్లాడు. ఆయన గుమ్మంలో అడుగు పెట్టటం చూసి కట్టెలు కొట్టేవాడి భార్య లోపలికి ఆహ్వానించి కూచోబెట్టి ఎంతో మర్యాద చేసింది. మంత్రికి గంధపుచెక్కల వాసన ఘాటుగా తగిలింది.

"గంధపుచెక్క ఇంట్లో పుష్కలంగా ఉన్నట్టున్నదే. అది అమ్ముకుని సుఖంగా బతక్క ఇంత అగచాట్లు పడుతున్నారేం, తల్లీ?" అన్నాడు మంత్రి సానుభూతిగా.

"బాబూ, గట్టిగా అనకండి! నా మొగుడు కట్టెలు కొట్టేటప్పుడు ఎప్పుడన్నా గంధపు కర్రకూడా దొరుకుతుంది. దాన్ని ఒక గది నిండా పేర్చి పెట్టాం. ఎప్పుడో ఒకప్పుడు రాజుగారు చావటం జరగవచ్చు. ఆయనను దహనం చెయ్యటానికి గంధంచెక్క కొనే



టప్పుడు ఎంతధర అయినా ఇస్తారు. అందు కని దాన్ని చిల్లరగా వాళ్ళకూ వీళ్ళకూ అమ్మక నిలవేసి ఉంచాం!" అన్నది కట్టెలు కొట్టేవాడి భార్య.

రాజుకు కట్టెలుకొట్టేవాడిపైన ఆగ్రహం ఎందుకు కలుగుతున్నదో మంత్రికి తెలిసి పోయింది. కట్టెలుకొట్టేవాడు అడవికి వెళ్లే టప్పుడు తన దారిద్ర్యం గురించి అను కుంటాడు, తన ఇంటి ఖర్చుకు సరిపడా కట్టెలు దొరకాలని కోరుకుంటాడు. ఆ సమయంలో రాజు వాడి స్థితి చూసి జాలి పడతాడు.

కట్టెలుకొట్టేవాడు తన పని పూర్తి చేసు కుని ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు తాను దాచి ఉంచిన గందపుకట్టె గురించి అనుకుని, రాజు త్వరగా చనిపోతే అదంతా సొమ్ము అవుతుందిగదా అనుకుంటాడు. ఆ సమ యంలో రాజుగారికి వాడిమీద పట్టరాని కోపం వస్తుంది.

కట్టెలవాడి భావాలూ, రాజుగారి భావాలూ బింబ ప్రతిబింబాలు.

మంత్రి కట్టెలుకొట్టేవాడి భార్య వద్ద సెలవు తీసుకుని తన ఇంటికి వెళ్లిపోయి, మర్నాడు ఉదయం మామూలుగానే సభకు హాజరయాడు.

"ఏం, మంత్రీ? రహస్యం అంతు చిక్కిందా?" అని రాజు అడిగాడు.

"నిజం తెలుసుకున్నాను, మహారాజా. ఆ కట్టెలుకొట్టేవాణ్ణి శిక్షించనని మాట ఇస్తే తమకు యథార్థం విన్నవించు కుంటాను," అంటూ జరిగిన సంగతి అంతా చెప్పేశాడు మంత్రి.

కట్టెలు కొట్టేవాడు దరిద్రుడై ఉండటం చేతనేగదా రోజూ తన మరణం కోరుతున్నా డని గ్రహించి రాజు వాణ్ణి పిలిపించి, తగిన విధంగా మందలించి, కొంత డబ్బు కూడా ఇచ్చి వాడు అటే శ్రమ లేకుండా జీవితం గడిపే ఏర్పాట్లు చేయించాడు.






## 4

త్వరలోనే రాజకుమారుడు పెళ్లివారిని చేర వచ్చాడు. మంత్రులు వాణ్ణి ఆపి, "నువ్వు మా యువరాజుకు అమ్మినవి ఏం పళ్ళు?" అని అడిగారు.

"అవి నేను స్వయంగా చెట్లనుంచి కోసినవే నే!" అన్నాడు రాజకుమారుడు అమాయికంగా.

"అయితే వాటిని తిన్నాక మా యువ రాజుగారికి రెండు కొమ్ములెందుకు మొలి చాయి, బారెడు తెల్ల గడ్డం ఎలావచ్చింది?" అని వాళ్లు రాజకుమారుణ్ణి మళ్లీ అడిగారు.

ఈ మాటలు సహజంగా రాజకుమారు డికి ఆశ్చర్యం కలిగించలేదు. అలా జరుగు తుందని వాడికి తెలుసు.

"నేను రోజూ ఈ పళ్ళే తింటున్నాను గదా నాకు కొమ్ములూ, గడ్డాలూ రాలేదే!" అన్నాడు వాడు.

ఇందు కేమనాలో మంత్రులకు తోచలేదు. రాజకుమారుడు కాస్సేపు ఆలోచించినట్టు నటించి, "మీ యువరాజుగారు, కొంపతీసి, ఆ పళ్ళు తిన్నాక నిద్రపోలేదుగద?" అని అడిగాడు.

"నిద్రపోకేం? పోయారు!" అన్నారు మంత్రులు.

"ఇంకేం? అదే కొంప తీసింది! పాపం, మీరు దూరదేశంనుంచి వస్తున్నారులాగుంది, అందుచేత మీ కిక్కడి ఆచారాలు తెలీవు. ఏదన్నా తిని నిద్రపోనేరాదు! నిద్రపోయారో

సి. మాధవరావు




కొమ్ములూ, గడ్డాలూ మొలిచాయే!" అన్నాడు రాజకుమారుడు.

ఈ మాటలు విని దూరదేశపు మంత్రులు ముఖ ముఖాలు చూసుకున్నారు. తప్పు యువరాజుదే! లేకపోతే పందిలాగా తిని, ఎందుకు నిద్రపోవాలి? కాని ఇప్పుడేం చేసేటట్టు? పెద్దచిక్కే వచ్చింది. రాజకుమార్తె ఈ రూపంలో ఉన్న యువరాజును చచ్చినా పెళ్ళాడదు.

"ఈ పెళ్ళికొడుకును తీసుకుపోయి చూపామో మనని చితకదన్నుతారు! అంతకంటె వెనక్కు తిరిగి పోవటమే ఎంతో మేలు," అని మంత్రులు అన్నారు.



"నేను చచ్చినా వెనక్కు తిరిగి పోను. ఆ రాజకుమార్తె మీద ఎంతో కాలంగా ఆశ పెట్టుకుని ఉన్నాను! ఇంతకాలానికి నాకామె దొరికితే ఇప్పుడు జారిపోనిస్తానా?" అన్నాడు యువరాజు.

మంత్రులలో యువరాజు మేలు మరీ మరీ కోరేవాడొకడు ఒక ఉపాయం ఆలోచించి ఇలా అన్నాడు: "పెళ్ళికొడుకని చూపించటానికి ఒక చక్కని యువకుణ్ణి సంపాదించుదాం. అప్పుడు రాజకుమార్తె మనదవుతుంది. ఒకసారి ఆమె మనదేశంలో అడుగుపెట్టాక మన మాట వినక ఏంజేస్తుంది?"

ఈ ఆలోచన చాలా బాగుందని అందరూ ఒప్పుకున్నారు. అందగాడైన యువకుణ్ణి పట్టటమే తరవాయి. తీరాచూడబోతే పరివారంలో వాళ్ళందరికన్నా పళ్ళు అమ్మిన కుర్రాడే అందంగా ఉన్నాడు.

యువరాజు మంత్రులు రాజకుమారుడికి తమ పన్నాగం వివరించి చెప్పి, పెళ్ళి అయినదాకా పెళ్ళికొడుకుగా ఉండమని కోరారు. వాడు తన సంతోషాన్ని పైకి కనబడనియ్యక, "మధ్య నాకేమిటి సంబంధం. మీరూమీరూ ఏమైనాకండి. నాకు లక్ష పనులున్నాయి!" అని బెట్టుచేశాడు.





మంత్రులు రాజకుమారుణ్ణి ఒత్తిడిచేసి బంగారుకాసులు బేరం పెట్టారు. అయిదు కాసులిస్తామంటే చాలదని పేచీ పెట్టి, వాడు ఏడు కాసులు పుచ్చుకుని పెళ్ళికొడుకు కావటానికి ఒప్పుకున్నాడు.



రాజకుమారుడికి మంచి దుస్తులు వేసి బండిలో కూచోబెట్టారు. యువరాజును మామూలు గుర్రంమీద ఎక్కించి, వాడి నెత్తిన ఒక బురఖా వేశారు. నగరం చేరినాక యువరాజును ఒక గదిలో దాచి ఉంచటానికి ఏర్పాటు జరిగింది. ఈ ఏర్పాట్లన్నీ పూర్తిచేసుకుని పెళ్ళివారు ముందుకు కదిలారు.

రాజుగారు పెళ్ళివారికి నగరం వెలపలనే ఎదురుకోల ఇచ్చి స్వాగతం చెప్పాడు. తనకు కాబోయే అల్లుడు అందగాడయినందుకూ, పెళ్ళివారు భారీగా కట్నాలు తెచ్చినందుకూ ఆయన ఎంతో సంతోషించాడు. ఆయనకు ఒకటే విచారం; అదేమిటంటే, తన కుమార్తె అప్రతిష్ఠ గురించి పెళ్ళివారికి ఎక్కడ తెలిసిపోతుందోనని. ఆ సంగతి ఏమాత్రం తెలిసినా యువరాజు ఆమెను పెళ్ళాడడు. అందుకని రాజుగారు పెళ్ళి ప్రయత్నాలను వాయువేగంతో సాగించాడు. పెళ్ళి విందు నాలుగురోజులపాటు జరగాలి. ఈ నాలుగురోజులూ పెళ్ళివారికి ఊపిరి సలపకుండా విందులూ, వినోదాలూ జరిపించినట్టయితే వారికి రాజకుమార్తె అపఖ్యాతి గురించి తెలుసుకునే అవకాశం ఉండదు.

పెళ్ళివిందు మూడురోజులపాటు సాగింది. ఈ మూడురోజులూ పెళ్ళికూతురు కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూనే ఉన్నది. ఆమె తన ప్రియుడైన రాజకుమారుణ్ణి క్షణంపాటుకూడా మరవలేకుండా ఉన్నది. అందుచేత ఆమె తన మేలిముసుగు ఎత్తి పెళ్ళికొడుకును చూసుకున్న పాపానకూడా పోలేదు.



నాలుగో రోజు రాత్రి విందులో పెళ్ళి కూతురూ, పెళ్ళికొడుకూ పక్కపక్కనే కూచున్నారు. రాజకుమారుడు రాజకుమార్తెతో రహస్యంగా, "ఇదుగో, చూడు! నేనే వచ్చేశాను!" అన్నాడు.

ఆ మాటలు విని రాజకుమార్తె మేలిముసుగు ఎత్తి అతనికేసి చూసింది. మొట్టమొటద ఆమె తాను కలగంటున్నాననుకున్నది. ఎందుకంటే, ఆమెను తండ్రి అతనికిచ్చి ఎందుకు పెళ్ళిచేస్తాడు?

ఆమె ఆశ్చర్య సంభ్రమాలు ప్రకటించి రహస్యం బయుట పెట్టేస్తుందేమోనని భయపడి రాజకుమారుడు ఆమెతో, "ఏమీ తెలియనట్టు నటించు," అని హెచ్చరించి జరిగినదంతా ఆమెకు చెప్పాడు. మునురుపోయి ఎండ వచ్చినట్టుగా రాజకుమార్తె దుఃఖం మాని చిరునవ్వు నవ్వింది. తరవాత కొత్త భార్యాభర్తలు ఎంతో సరదాగా సంభాషించుకున్నారు, హాస్యాలాడుకున్నారు, నృత్యంకూడా చేశారు. నృత్యంచేసే సమయంలోనే వాళ్ళు పారిపోయే పథకంకూడా ఆలోచించుకున్నారు.

"అంపకాల సమయంలో నువు మీ నాన్నను కొయ్యగుర్రం కావాలని అడుగు. అది లేకుండా అత్తవారింటికి వెళ్ళనని భీష్మించుకు కూచో. బెదిరింపులకు కూడా



లొంగకు!" అని రాజకుమారుడు రాజకుమార్తెకు సలహా ఇచ్చాడు.

మర్నాడు అంపకాలు. ఆస్థానంలోని పెద్ద ఉద్యోగులందరూ రాజభవన ద్వారం వద్ద చేరి రాజకుమార్తెను సాగనంపటానికి సిద్ధంగా ఉన్నారు. రాజకుమారుడూ, పరివారమూ, మంత్రులూ, బయలుదేరటానికి సిద్ధంగా ఉన్నారు.

రాజభవనంలో రాజకుమార్తె తన తండ్రి కాళ్ళు పట్టుకుని తనకు కొయ్యగుర్రం ఇచ్చెయ్యమని ప్రార్థిస్తున్నది.

రాజు మండిపడ్డాడు. "తలారిని పిలిపించి ఇప్పుడే నీ తల తీయించగలను జాగ్రత్త!" అని కూతుర్ని భయపెట్టి చూశాడు కూడా. రాజకుమార్తె భయపడక, "ఆ గుర్రం లేకుండా వెళ్ళేకన్న చావటానికైనా నేను సిద్ధమే!" అన్నది.

రాజుకు ఒక చెంప కోపమూ, మరొక పంక ఆందోళనా కలిగాయి. ఏమి చెయ్యాలో ఆయనకు పాలుపోలేదు.

ఇంతలో బయట వేచిఉన్న పెద్దలు లోపలికి వచ్చి, "ఏమిటి ఆలస్యం, మహారాజా?" అని అడిగారు.

"ఈ పిచ్చిది ఏదో కొయ్యగుర్రాన్ని వెంట తీసుకుపోతానని నన్ను వేధిస్తున్నది," అన్నాడు రాజు వారితో.






పెద్దలు నవ్వి, "అయితే ఆ కొయ్యగుర్రాన్ని ఇచ్చి పంపరాదా? ఇదొక సమస్యా ఏమిటి?" అన్నారు.

రాజుకిక తప్పలేదు. ఆయన నౌకర్లచేత కొయ్యగుర్రాన్ని తెప్పించి తన కుమార్తెకిచ్చాడు. ఆ తరవాత పెళ్ళివారు వీడ్కోలు ముగించి తరలి పోయూరు.

ప్రయాణం చాలారోజులు పట్టింది. కాని ప్రతి క్షణమూ యువరాజు భటులు రాజకుమార్తెనూ, రాజకుమారుణ్ణీ వెయ్యి కళ్లతో కనిపెడుతూ, తప్పించుకు పారిపోవటానికి వారికి చీమతలకాయంత అవకాశం కూడా చిక్కనివ్వలేదు. గమ్యస్థానం దగ్గిర పడు



తున్నకొద్దీ ప్రేయసీ ప్రియుల ఆందోళన కూడా హెచ్చింది. అయితే ఆఖరు క్షణంలో రాజకుమారుడికి ఒక యుక్తి తట్టింది. వాడు దాన్ని రాజకుమార్తెకు చెప్పాడు.

ప్రయాణం పూర్తి అయింది. వారు యువరాజుండే భవనద్వారం చేరారు. రాజకుమార్తె మంత్రులను పిలిచి, "గృహ ప్రవేశం చేసేముందు బంగారు మాడలు విరజిమ్మటం మా దేశాచారం. ఏడు పళ్లాల నిండా బంగారు మాడలు పోసుకు రండి. నేను వాటిని విరజిమ్ముతాను. వాటిని ఎవరు కావలిస్తే వారు ఏరుకోవచ్చు," అన్నది.

నిజంగా అలాటి ఆచారం ఉందికాబోలు ననుకుని మంత్రులు ఏడు పళ్ళాలతోనూ బంగారు మాడలు తెప్పించారు. రాజకుమార్తె వాటిని అన్నివైపులా విరజిమ్మింది. అంతదాకా ఆమెను కంటి రెప్పలాగా కాపాడుతున్న నౌకర్లు ఆ బంగారాన్ని ఏరటానికి దూరంగా పరిగెత్తారు.

ఆ గందరగోళంలో రాజకుమారుడు కొయ్యగుర్రాన్ని నేలపై పెట్టి ఎక్కి కూచున్నాడు. అతని వెనకగా రాజకుమార్తె ఎక్కి కూచున్నది. రాజకుమారుడు గబగబా మీటలన్నీ వదులుచేశాడు. ఏం జరిగిందో మంత్రులు అర్థంచేసుకునే లోపల కొయ్య



గుర్రం రాజకుమార్తెనూ, రాజకుమారుణ్ణీ తీసుకుని ఆకాశంలోకి రివ్వున ఎగిరి క్షణంలో కనపడకుండా పోయింది....

ఈలోపల రాజకుమారుడి తండ్రి తన కొడుకు ఏమైపోయాడోనని తహతహలాడి పోతున్నాడు. ఉదయం వెళ్ళిన కుర్రవాడు సాయంకాలందాకా రాకపోయే సరికి ఆయన వడ్రంగి మీద అలిగి, వాణ్ణి ఖైదులో పెట్టించాడు.

ఆ తరవాత రోజులూ వారాలూ గడిచినా రాజకుమారుడు తిరిగి రానేలేదు. ఆ దిక్కుమాలిన కొయ్యగుర్రం ఏ సముద్రం మీదుగా ఎగురుతూ పడిపోయిందోనని ఆయన కొంత మంది మనుషులను ఉక్కు చేపలో సముద్రాలన్నీ ఘాలించమని పంపాడు. రాజభవనంలో ఇంతకాలమూ ఒక వినోదంగాని, ఆనందంగాని లేదు. రాజుగారు తన కొడుకుపై అన్ని ఆశలూ వదులుకుని వడ్రంగిని ఉరితీయించమని ఉత్తరువుకూడా ఇచ్చాడు.

అటువంటి పరిస్థితిలో రాజకుమారుడు తన భార్యతో సహా ఇల్లు చేరుకున్నాడు. వాడు తన తండ్రితో, "నాన్నా, ఈ కొయ్యగుర్రాన్ని మించిన వింత ప్రపంచంలో మరొకటి ఉండదు. దాని సహాయంతోనే నేను ఎన్నో దేశాలు తిరిగాను, ప్రపంచలో కెల్లా అద్భుత సుందరి అయినదాన్ని భార్యగా సంపాదించుకుని ఇంటికి తిరిగి వచ్చాను. ఆ వడ్రంగికి ఎంత ఇచ్చినా అతని ఋణం తీరదు!" అన్నాడు.

కొడుకు కథ అంతా విన్నాక రాజుకు సంతోషమూ, వడ్రంగిని ఖైదు చేయించినందుకు పశ్చాత్తాపమూ కలిగాయి. ఆయన వెంటనే వడ్రంగిని విడిపించి, క్షమాపణ చెప్పుకుని గొప్పగొప్ప బహుమానాలిచ్చాడు.

రాజకుమార్తెకూ రాజకుమారుడికీ మరొకసారి వైభవంగా పెళ్ళి జరిగింది. ఆ తరవాత వారు సుఖంగా ఉన్నారు.

—[సమాప్తం]






మళ్లీ పూర్ణిమ వచ్చింది. భోజనాలయాక తాతయ్య వెన్నెట్లో వాలుకుర్చీ వేసుకుని కూచున్నాడు. పిల్లలు ఎప్పటిలాగే ఆయన చుట్టూ చేరారు.

తాతయ్య పొడుంకాయ తీసి పొడుం పీల్చి, ముక్కుదులుపుకుని, ఇలా చదివాడు:

"రహస్య మాత్మనో ధీమాన్
శత్రుభ్యో నప్రకాశయేత్;
అన్యథా వంచితస్తస్యే
చ్చండ కర్మేవ రాక్షసః"

"కథ, కథ!" అని పిల్లలు ఒక్కసారిగా కేకలుపెట్టారు.

"ఆ శ్లోకానికి అర్థమేమిటని అడగరేం?" అన్నాడు తాతయ్య.

"అర్థం చెప్పు, తాతయ్యా!...కథకూడా చెప్పు తాతయ్యా!..." అన్నారు పిల్లలు.

"ఆ శ్లోకానికి అర్థమేమిటంటే—శత్రువులకు మన రహస్యాలు ఎన్నటికీ చెప్పకూడదూ అని! ఒకవేళ మన రహస్యం చెప్పేశామో, చండకర్ముడనే రాక్షసుడిలాగే మోసపోతామూ అని!" అన్నాడు తాతయ్య.

"రాక్షసుడి రహస్యమేమిటి, తాతయ్యా? దాన్నివాడు ఎవరికి చెప్పేశాడు, తాతయ్యా? చివరికి వాడెలా మోసపోయాడు, తాతయ్యా?" అని పిల్లలు ప్రశ్నల వర్షం కురిపించారు.

"కొంచెం ఓపిక పట్టండర్రా, అంతా చెబుతానూ!" అంటూ తాతయ్య ఈవిధంగా చెప్పాడు:

పూర్వం గోదావరీ నదికి దక్షిణతీరాన ఒక మహారణ్యం ఉండేది. ఆ అరణ్యంలో చండకర్ముడనే రాక్షసుడు ఉంటూండేవాడు. వాడు రోజూ ఎలా పొట్టపోసుకునేవాడో తెలుసా? అడవి మార్గాన వెళ్లేవాళ్లను పట్టుకోవటమూ, వాళ్ల భుజాలమీద ఎక్కి కూచోవటమూ, ఆ సమీపంలోనే ఉన్న

తాతయ్య కథలు :—9

రచన: సి. శేషాద్రి

సరస్సుకు తీసుకుపొమ్మనటమూ, అక్కడ స్నానంచేసి ఆ మనిషిని తినెయ్యటమూనూ!

అయిందా? ఒకనాడు కర్మచాలక ఒక బ్రాహ్మడు ఈ చండకర్ముడుండే దిక్కుగా అడవి మార్గానపడి వచ్చాడు. ఇంకేముందీ? రాక్షసుడు చెంగున ఆ బ్రాహ్మడి భుజాల మీద ఎక్కి కూచుని, సరస్సు వద్దకు పొమ్మని అజ్ఞాపించాడు. తప్పేదేముందీ? ప్రాణాలు పిచపిచ లాడుతూ ఆ బ్రాహ్మడు ఆ రాక్షసుణ్ణి మోసుకుని నడపసాగాడు.

అలా నడుస్తూండగా బ్రాహ్మడికి ఒక చిత్రం కనబడింది. తన భుజాలమీద ఎక్కి కూచున్న రాక్షసుడు ఎంత భయంకరంగా ఉన్నాడో వాడి పాదాలు అంత నాజూకుగా, మృదువుగా, తామరపూలలాగా ఉన్నాయి.

బ్రాహ్మడు ధైర్యం చేసి రాక్షసుడితో, "నాయనా, నీవు చూడబోతే ఘోరటుగా ఉన్నావు, నీ పాదాలు ఇంత కోమలంగా ఉండటానికి కారణమేమిటి?" అన్నాడు.

రాక్షసుడు తన పాదాలను బ్రాహ్మడు మెచ్చుకున్నందుకు గర్వపడి, "వినవయ్యా, ఓ బ్రాహ్మడా! నేను ఎన్నడూ తడి పాదాలతో భూమిని తాకను. ఇది నా వ్రతం. అందుకే నా పాదాలు అంత కోమలంగా ఉన్నాయి!" అన్నాడు.

ఇంకేముందీ? రాక్షసుడి రహస్యం కాస్తా బ్రాహ్మడికి తెలిసిపోయింది.

ఇద్దరూ సరస్సు వద్దకు వచ్చారు. రాక్షసుడు సరస్సులోకి దిగుతూ, "బ్రాహ్మడా, నేను వచ్చేదాకా నువ్వు ఈ సరస్సు ఒడ్డునే ఉండు. స్నానంచేసి, పూజ చేసుకుని వస్తాను," అన్నాడు.

రాక్షసుడు చెప్పినట్టు చేస్తే తన గతి ఏమయేదీ బ్రాహ్మడికి తెలుసు. అందుచేత బ్రాహ్మడు కాలిబలం కొద్దీ పారిపోయాడు. రాక్షసుడు తడికాళ్లతో భూమిని తాకడుగా? అందుకని వాడు చూస్తూ ఆ సరస్సులోనే ఉండిపోయాడు.





# స్వర్గ నరకాలు

ఇంగ్లాండులో ఒక మతాచార్యుడుండేవాడు. కొందరు ప్రసిద్ధ శాస్త్రవేత్తలు మరణించి నట్టుగా విన్నమీదట ఆయనకు ఒక శంక పుట్టుకొచ్చింది; ఈ శాస్త్రవేత్తలు స్వర్గానికి వెళతారా? లేక నరకానికి వెళతారా? వారు ఏనాడూ భగవంతుణ్ణి స్మరించిన వారుకారు గనక స్వర్గంలో వారికి తావు ఉండదు; అయితే వారు ఏ పాపాలూ చేసిన వారుకూడా కారు, లోకానికి అనేక విధాల ఉపకారం చేశారుకూడానూ, అందుచేత వారు నరకానికి పోయినా అన్యాయమే.

"ఈ శాస్త్రవేత్తలు మరణానంతరం ఎక్కడికి పోయిఉంటారు?" అనుకుంటూ ఆ మతాచార్యుడు నిద్రపోయి కలగన్నాడు.

కలలో ఆయనకు స్వర్గాలన్నిటిలోకీ అత్యున్నతమైన స్వర్గం కనిపించింది. అక్కడ కనిపించిన దైవభక్తి పరులలో కొందరిని ఆయన గుర్తించగలిగాడు.

"చనిపోయిన సుప్రసిద్ధ శాస్త్రవేత్తలు ఎక్కడ ఉంటున్నారు?" అని ఆయన అక్కడి స్వర్గపాలకులను అడిగితే, అధః పాతాళంలో ఉంటున్నారని తెలిసింది.

తానుకూడా అధః పాతాళానికి వెళ్లి ఒక్కసారి ఆ శాస్త్రవేత్తలను చూడాలని పించింది మతాచార్యుడికి. ఇది ఎలా సాధ్య మవుతుందని అడిగితే రైళ్లు పాతాళానికి వెళ్లి వస్తుంటాయని చెప్పారు. మతా చార్యుడు ఒకటో తరగతి టిక్కెట్టు తీసుకుని రైలు ఎక్కి బయలుదేరాడు. రైలు ఒక్కొక్క స్వర్గమే దిగి నరకాలలో ప్రవేశించింది.

ఒక్కొక్క నరకమే గడుస్తున్నకొద్దీ మతాచార్యుడికి ప్రయాణం దుర్భరంగా తోచింది. రైలులో నుంచి చూస్తే భీభత్స మైన దృశ్యాలు; చెవికి కఠోరంగా వినిపించే ఆక్రందనాలు; భరించలేని దుర్గంధం.

స్వామి రామతీర్థ

ఇంక రాబోయే స్టేషను అధః పాతాళ మనగా మతాచార్యుడు దుర్గంధమూ, ఆర్త నాదాలూ భరించలేక స్పృహతప్పి పడి పోయాడు. "అధః పాతాళం! అధః పాతాళం" అన్న కేకలకు ఆయనకు స్పృహ వచ్చింది. ఆయన కళ్ళు తెరిచి చూసి, "ఇదా అధః-పాతాళం? అసంభవం! దీన్ని చూస్తే అత్యున్నత స్వర్గంలాగుందే!" అన్నాడు. కాని తోటి ప్రయాణీకులు అదే అధః పాతాళమని ఆయనతో చెప్పారు. ఇంతలో గార్డు వచ్చి, ఆయన టిక్కెట్టు తీసుకుని, "మీరు ఇక్కడే దిగిపోవాలి," అన్నాడు.

మతాచార్యుడు రైలు దిగి నడకసాగాడు. అంతటా పూలతోటలు, కమ్మని వాసనలు, చల్లని పిల్ల తెమ్మెరలు. ఈ ప్రదేశం అత్యున్నత స్వర్గం కంటెకూడా బాగుంది.

ఈ రహస్యం ఏమిటో తెలుసుకోవాలను కుంటుండగా ఆయనకు తెలిసిన శాస్త్రవేత్త ఒకడు కనిపించాడు.

"మీరంతా అధఃపాతాళంలో అగచాట్లు పడుతున్నారనుకుని మీకు మత ప్రబోధం చేసి స్వర్గానికి పంపుదామనుకుని వచ్చాను కాని ఇదే స్వర్గాన్ని మించి ఉన్నదే. ఏమిటి కారణం?" అన్నాడు మతాచార్యుడు.

"ఇప్పుడిలాగుంది గాని మేము వచ్చి నప్పు డిక్కడ పెంటపోగులూ, కాగే ఇనుమూ, బురద మడుగులూ, పొగలు చిమ్మే ఇసుక దిబ్బలూ—చాలా భయం కరంగా ఉండింది. మమ్మల్ని బురదకంప కాలలో దించారు. మేము కష్టపడి ఆ బురదనీటితో కాగిన ఇనుమును చల్లార్చాం. ఆ ఇనుముతో యంత్ర పరికరాలు చేశాం. గుంటలు పూడ్చాం. ఇసకదిబ్బలు పెంట పోగులూ కలయదున్ని, మా శాస్త్ర పరిజ్ఞానం సహాయంతో అధః పాతాళాన్ని స్వర్గంలాగా మార్చాం. ఏ పదార్థం ఎలా ఉపయోగ పరచాలో అలా ఉపయోగ పరిస్తే సరకం స్వర్గ మవుతుంది," అన్నాడు శాస్త్రవేత్త.



# రామేశ్వరం

మనదేశపు పుణ్యస్థలాలలో అగ్రస్థానం వహించేవి కాశీ రామేశ్వరాలు. వాటిలో రామేశ్వరాలయం గొప్ప అద్భుతాలలో ఒకటి. ఎందుకంటే ద్రావిడ శిల్పకళకు ఎక్కడా ఇంతకన్న మంచి నిదర్శనం మరొకటి దొరకదు. దక్షిణభారతపు ఆగ్నేయాగ్రంలో గల ఒక దీవిపై ఈ ఆలయాన్ని ఒక సింహళరాజు కట్టించాడనీ, దీని నిర్మాణం 350 ఏళ్లు పట్టిందనీ చెబుతారు. దీని ఆవరణ నిడివి 1000 అడుగులు, వెడల్పు 650 అడుగులు. గోపురం ఎత్తు 100 అడుగులు. ఈ ఆలయంలో చక్కని శిల్పంతోగూడిన స్తంభాలతో అలంకరించిన నడవలు 4000 అడుగుల నిడివిగలిగి ఉన్నవి. శివభక్తుడైన రావణాసురుణ్ణి చంపిన పాపం పోవటానికి రాముడు ఇక్కడి దేవుణ్ణి అర్చించాడట. ఇక్కడి శివుడికి రామనాథ స్వామి అని పేరు.



# అట్టచివరిబొమ్మ

ఆరోజు యుద్ధం ఆరంభమవుతూనే కర్ణుడు ధర్మరాజుతో పోరాడి ఓడించి విరథుణ్ణి చేశాడు. ధర్మరాజు పారిపోసాగాడు. కర్ణుడు ఆయనను పట్టుకోబోతూ, కుంతికి ఇచ్చిన మాట స్మరించి ఆ ప్రయత్నం మాని, ధర్మరాజుతో, "నీవు క్షత్రియుడివి కావు. యజ్ఞ యాగాదులు చేసుకుంటూ వేదాలు పఠించవలిసిన వాడివి. యుద్ధంచేసే క్షత్రియుడివైతే ప్రాణాలకు వెరిచి పారిపోతావా?" అని ఎత్తిపొడిచాడు.

ఈ సంగతి తెలిసి భీముడికి పట్టరాని ఆగ్రహం వచ్చి కర్ణుడిపైకి వచ్చాడు. శల్యుడు కర్ణుడితో, "చూశావా? భీముడు కాలరుద్రుడిలాగా వస్తున్నాడు. ఇప్పుడతని ఎదట పడటం క్షేమంకాదు," అని పిరికిమందు పోశాడు. కాని కర్ణుడు శల్యుడితో, "ఈ భీముణ్ణి ఇప్పుడు నేను చంపటమో, ఓడించటమో జరిగితే అర్జునుడు నా పైకి వస్తాడు. నా కోరిక నెరవేరుతుంది," అన్నాడు.

అయితే కర్ణుడి కోరిక..నెరవేరలేదు. భీముడు కర్ణుణ్ణి రథంలో మూర్ఛపోగొట్టాడు, శల్యుడు రథాన్ని మళ్ళించుకుని దూరంగా వెళ్ళిపోయాడు. ఆ విజయగర్వంతో భీముడు కౌరవ వీరులపైబడి చిత్రవధ సాగించాడు. వివిత్సుడు, క్రాథుడు, మొదలైన ధృతరాష్ట్ర పుత్రులు భీముడి చేతిలో చచ్చారు.

దుర్యోధనుడికి సంతోషం కలగగలందులకు అశ్వత్థామ ఒక ఘోర ప్రతిజ్ఞ చేశాడు—ఆరోజు ధృష్టద్యుమ్నుణ్ణి చంపక తన కవచం విప్పనన్నాడు. అతను ధృష్టద్యుమ్నుణ్ణి ఎదుర్కొని చంపినంతపనీ చేశాడుకూడా. సమయానికి అర్జునుడు వచ్చి అశ్వత్థామకు అడ్డుపడి ధృష్టద్యుమ్నుడి ప్రాణాలు కాపాడాడు.

ఇలా ఉండగా కర్ణుడు ఆనాటి సాయంకాలం మరొకసారి ధర్మరాజుతో తలపడ్డాడు. ధర్మరాజూ, ఆయనకు చక్రరక్షకులుగా ఉన్న నకుల సహదేవులూ కర్ణుడి చేతిలో చావుదెబ్బలు తిన్నారు. ఆ విషమ పరిస్థితిలో శల్యుడు కర్ణుడితో, "ఈ ధర్మరాజుతో పోట్లాడితే నీకేమిలాభం? అర్జునుడితో పోట్లాడాలి. అదీగాక అవతల దుర్యోధనుడు భీముడి చేతిలో చిక్కి అపాయస్థితిలో ఉన్నాడు. అతన్ని రక్షించటం మన కర్తవ్యం," అన్నాడు.

ధర్మరాజు శిబిరానికి వెళ్ళిపోయి, శరీరంలో గుచ్చుకున్న బాణాలు ఊడబెరికి, మనసులో గుచ్చుకున్న మాటలను పెరకలేక బాధపడసాగాడు.

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వాఖ్యలు 1961 జూన్ సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఏప్రిల్ నెల 10-వతేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

### ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : పల్లెటూళ్ల దినుసు

రెండవ ఫోటో : పట్నాల సొగసు

పంపినవారు : ఎస్. కె. ధనలక్ష్మి,

నేర్లగిరి, ( సేలంజిల్లా )

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒక రోజున గొర్రెలుకాచే కుర్రవాడు, ఒక చేపను గాలానికి గుచ్చి, దాన్ని కాలవలో పడవేసి, దాసూ, వాసూల దగ్గిరకు వచ్చి తను గొర్రెల్నికాయటంలోనే గాక, చేపలు పట్టటంలోకూడా మొనగాణ్ణని చెప్పాడు. అందరూ కలిసి కాలవ దగ్గిరకు వెళ్ళారు. గొర్రెలు కాచే కుర్రవాడు గాలాన్ని దాసూ వాసూలకు చూపి, పెద్ద చేప పడేందుకు మంత్రం చదివి యిప్పుడే వస్తానని అవతలికి వెళ్ళాడు. దాసూ, వాసూలు గాలానికి పెద్ద ఇటుకరాయి కట్టి, ఏమీ ఎరగనట్టు నిలబడ్డారు. గొర్రెలుకాచే కుర్రవాడు తిరిగివచ్చి, నీళ్ళలోనుంచి గాలాన్ని లాగేసరికి, ఇటుక రాయి వచ్చింది. దాసూ వాసూలు పొట్టలు చెక్కలయేలా నవ్వుకున్నారు.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'






GRIPE SYRUP








"FOR YOUR SWEET PLEASURE"




1. బావిశెట్టి బాబురావు, వేట్లపాలెం

రెండు నెలల నుండి "చందమామ"లో స్థలపురాణం లేదు. కారణ మేమిటి?

ఆ శీర్షికకు మంచి రచనలు రాక నిలిపివేశాం.

2. వై. ఉమాకాంతరావు, కటకం

ఇదివరకూ లావు పేజీలు ప్రచురించుచున్న "మహాభారతం" ఫిబ్రవరి సంచికలో ఒక్క పేజీ మాత్రం ప్రచురించుటకు కారణం?

యుద్ధ పర్వంలో కథ అంతగా సాగదు. అందుకని పేజీలు తగ్గించాం. అందులో రకరకాల బొమ్మలు వేసే అవకాశం లేనందున దాన్ని అట్ట చివరిబొమ్మ కథగా మార్చాం.

3. జి. జోగయ్య చౌదరి, శింగ్రాయపాలెం

"చందమామ"లో భారత కథలాగె రామాయణము కూడ సీరియలుగా ప్రచురిస్తే చాలా బాగుండేది కదా?

మే సంచిక నుండి రామాయణము రెండవ బొమ్మల సీరియలుగా ప్రచురిస్తున్నాము.

4. జె. విజయకుమారి, యల్లనూరు

అన్నయ్యా, నా పేరు "చందమామ"లో పడాలంటే ఏమి చెయ్యాలి?

ఇది ఒక పద్ధతి!

5. ఎం. రాజయ్య, నాగారం (పోస్టు)

"జ్వాలాద్వీపం" ఎన్నడు ప్రింటు అవుతుంది? ఎప్పుడు పంపగలరు? దాని వెల ఎంత?

"చందమామ"లో పడే సీరియల్ కథలు పుస్తకాలుగా వస్తాయని ఎదురు చూడ వద్దు. "చందమామ"లలో నుంచి మీకు నచ్చినవి తీసి భద్రపరుచుకోండి.

6. సి. శాయిబాబా, మచిలీపట్నం

ఏ శీర్షిక పేరుతో ఆయా కాగితాలను వ్రాసి అన్నిటినీ ఒకే కవరులో పెట్టి పంపిన మీకేమైనా అభ్యంతరమా?

లేదు. అన్నీ ఒకే కాగితంమీద రాసి పంపితేనే మాకు అభ్యంతరం.

# ఆమెకు గల్గిన విజయంలో యిమిడియున్న రహస్యం




మరునాడు పారూ చేసిన సహాయానికి ధన్యవాదాలు











## Statement about ownership of CHANDAMAMA (Telugu) Rule 8 Form IV), Newspapers (Central) Rules, 1956

| | | |
|---|---|---|
| 1. *Place of Publication* | : | 'CHANDAMAMA BUILDINGS' 2 & 3, Arcot Road, Vadapalani. Madras-26 |
| 2. *Periodicity of Publication* | : | MONTHLY 1st of each Calendar month |
| 3. *Printer's Name* | : | B. NAGI REDDI, Managing Director, The B. N. K. Press (Pvt.) Ltd. |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 4. *Publisher's Name* | : | B. VENUGOPAL REDDI, Managing Partner, Sarada Binding Works |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 5. *Editor's Name* | : | CHAKRAPANI (A. V. Subba Rao) |
| *Nationality* | | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 6. *Name & Address of individuals who own the paper* | : | SARADA BINDING WORKS : PARTNERS, |

1. Sri. B. Venugopal Reddi.
2. Smt. B. Seshamma.
3. Smt. B. Rajani Saraswathi.
4. Smt. A. Jayalakshmi.
5. Sri. B. L. N. Prasad.
6. ★ Kumari. B. Sarada.
7. ★ Sri. B. Viswanatha Reddi.
8. ★ Sri. B. Venkatrama Reddi.

★ MINORS

I, B. Venugopal Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*1st March, 1961*

**B. VENUGOPAL REDDI,**
*Signature of the Publisher*




PP
PRASAD
PROCESS

